# పన్నా

(చరిత్రాత్మక నాటకము)

రచయిత:
కంతేటి వెంకట్రామరాజు




పబ్లిషర్సు
ఉమా పబ్లి
విజయవాడ-1

ప్రథమ ముద్రణ
1000, ప్రతులు
జనవరి 1959



మూల్యం రు. **1-50**

గమనిక :-

రచయితనుండి లిఖితపూర్వకమైన అనుమతి లేకుండా,
ఈ నాటకాన్ని ఎవరూ ప్రదర్శించరాదు.

రచయిత :
కె. వి. రామరాజు
అరుణోదయ సంగీత నాట్యమండలి
గాంధీనగరం, విజయవాడ-2

ముద్రణ :
ఉమాప్రింటర్సు,
విజయవాడ-1

# సమర్పణ



కళాభిమానులు, సహృదయులు, సన్నిహితులైన

శ్రీ సుంకర కనకారావు గారికి

ప్రేమతో

రామరాజు

# కృతజ్ఞత

ఈ నాటకాన్ని రూపొందించుటలో సహకరించిన మిత్రులకు, ప్రదర్శించిన నటీ నటులకు, అమూల్యమైన తమ అభిప్రాయాలిచ్చిన సాహిత్యవేత్తలకు, పాటలు వ్రాసియిచ్చిన శ్రీ వడ్లమాని పార్థసారథిగారికి, సంగీతాన్ని సమకూర్చిన దర్శకులు శ్రీ జి. రత్నారావుగారికి, ముఖచిత్రాన్ని చిత్రించిన శ్రీ పుల్లేశ్వరుగారికి నాకృతజ్ఞతాభి వందనములు.

ఈ నాటకాన్ని స్వల్పవ్యవధిలో ముద్రించి త్వరిత గతిని ఆంధ్ర దేశాని కందించిన "ఉమా పబ్లిషర్సు" కు నా కృతజ్ఞతాభి వందనములు.

"రాజముకుట్" అను హిందీ నాటకం నా రచన కెంతో తోడ్పడింది. ఆ నాటక కర్తలైన పండిత గోవింద వల్లభ్ పంత్ గారికి నా కృతజ్ఞతాభి వందనములు.

రచయిత

# "పన్నా" గురించి

దేశభక్తి, ప్రభుభక్తి, స్వామిభక్తి, అనే పవిత్రభావాలు హృదయంలో ఉప్పొంగినప్పుడు మన చరిత్రలో మహా వీరులు, వీరాంగనలు జ్ఞప్తికివచ్చి ఒళ్లుపులకరిస్తుంది. ఆ ఆవేశంలోనే అనేకమంది వీరయువతులు జన్మ భూమిసేవలో కత్తిపట్టి కదనరంగాని కురికారు. స్వా తంత్ర్యంకోసం సైన్యాన్ని సమీకరించి విజయ శం ఖాన్ని పూరించారు. పాతివ్రత్యమే పరమావధియని అగ్నికి ఆహుతైపోయారు. పరదాస్య విముక్తికోసం విప్లవపోరాటాల్లో పాల్గొని యెంతోమంది వీర యువ తులు, తుపాకిగుండ్లకు బలియైపోయారు. ఉరికంబా లెక్కారు, లాఠీదెబ్బలు తిన్నారు. కారాగృహాల్లో కఠినశిక్షలు అనుభవించారు. అందుకు ఫలితంగా స్వాతంత్ర్య జ్యోతులు వెలిగించి మంగళగీతాన్ని పాడుకున్నారు...

వీరులకు పుట్టినిల్లైన మేవాడ పుణ్యభూమిలో పుట్టి రసపుత్ర వంశానికి, వనితాలోకానికి వన్నె తెచ్చిన వీరవనిత "పన్నా"

పెనుతుపాను భీభత్సంలో నడిసముద్రాన దిక్కు తోచక అల్లాడిపోతున్న స్వాతంత్ర్యనౌకను మహానావి కునివలె దరికిచేర్చిన క్షాత్రాణీ "పన్నా"

స్వార్థాన్ని త్యజించి. సబలత్వాన్ని నిరూపించి దేశంకోసమే తాను ఆహుతియైపోవాలని ధైర్యంతో ముందుకురికిన వీరమాత "పన్నా"

పెంచి పెద్దచేసిన మమకారాన్ని చంపుకోన లేక కని పెంచిన మమకారాన్ని చంపుకొని యువ రాజు ప్రాణరక్షణకోసం కన్నకొడుకును నరమాంస భక్షకుల కబంధహస్తాల కందించి తన ప్రభుభక్తిని నిరూపించిన రసపుత్ర వజ్రం "పన్నా"

ఎన్నో శ్రమలకోర్చి నేడు ఆంధ్రలోకానికి ఆంధ్ర నాటక రంగస్థలానికి అవతరించింది. ఈవీరాంగనను ఆదరించి ఆశీర్వాదిస్తారని ఆశిస్తున్నాను.

జైహింద్
రచయిత



రచయిత ఇతర నాటకములు :

| | |
|---|---|
| వీరవంశము<br>భగవాన్, బుద్ధ<br>చిత్రలేఖ | చరిత్రాత్మక నాటకములు |

ఈ నాటకాన్ని ప్రప్రథమంగా ప్రదర్శించిన

అరుణోదయ సంగీత నాట్యమండలి

నటీ నటవర్గం

| | |
|---|---|
| విక్రమ సింహుడు : | శ్రీ డి. యస్. రామరాజు |
| వనవీరుడు : | ,, జి. వి. సుబ్బారావు |
| కర్మచందు : | ,, యం. మస్తాన్ రావు |
| జయసింగు : | ,, జె. వి. సుబ్బారావు |
| రంజిత్ సింగు : | ,, జి. సాంబరాజు |
| ఉదయసింహుడు : | ,, సూర్యనారాయణమూర్తి |
| బారి : | ,, పి. వెంకటపతిరాజు |
| పన్నా : | శ్రీమతి పద్మశ్రీ |
| శీతల్ సేని : | శ్రీమతి కోమలాంగి |

కుమారి జయశ్రీ, టి. వి. రాజు, ఎ. హనుమంతరాజు

ఎ. కృష్ణమూర్తి మొదలగువారు... ...

నేపథ్య గానం :
కుమారి దినమణి, రామారావు

సంగీతం :
శ్రీ జి. రత్నారావు & పార్టీ

అలంకరణ :
శ్రీ ఎ. రామచంద్రరావు

దర్శకత్వం :
శ్రీ వెంపటి రాధాకృష్ణ

నిర్వాహణ : అరుణోదయ

| పాత్రలు | స్వభావము |
| --- | --- |
| విక్రమసింహుడు : | రాజకీయ విద్రోహుల కుతంత్రాలకు ఫలితంగా దుర్వ్యసనాలకు దాసుడై ప్రభుత్వాన్ని, ప్రజల్ని విస్మరించినందుకు కారాగృహంలో బంధించబడి నియంతల ఖడ్గదాహానికి బలై పోయిన మేవాడమహారాణా. నడి వయస్కుడు ... ... |
| వనవీరుడు : | మాతృఆజ్ఞకు తలవంచి, రాజ్యాకాంక్షతో, సామ్రాజ్య తత్వంలో మేనుమరచి సోదరత్వాన్ని చంపుకొని ఖడ్గాన్ని చేతబట్టి విచ్చలవిడిగా నెత్తుటేళ్లు పారించిన నియంత చక్రవర్తి. యువకుడు. |
| కర్మచందు : | భయంకర పెనుతుపానులో చెదిరిపోయిన మేవాడ వీరచరిత్ర పుటలను భద్రపరచుటలో ప్రాణము లర్పించిన నిస్వార్థ జీవి. వృద్ధ ప్రధానామాత్యుడు ... ... |
| జయసింగు : | ప్రజావిప్లవానికి నాయకత్వం వహించి దుష్టశక్తులను సమూలంగా నాశనమొనర్చిన యువకసర్దారు. కర్మచందు కుమారుడు ... ... |
| రంజిత్ సింగు : | పదవికోసం, పలుకుబడికోసం రంగులు మార్చే రాజకీయ ద్రోహి. నడివయస్కుడు, సర్దార్ ... ... |

పన్నా : దేశభక్తి, ప్రభుభక్తి భారతనారికి అమూల్యభూషణములని తనకడుపున పండించుకున్న పంటను కసాయిహస్తముల కందించి మేవాడ మహారాణా వంశాంకురాన్ని కాపాడి భారతవీరచరిత్రకు వనితాలోకానికి వన్నె తెచ్చిన అంతఃపురదాయి. నడి వయస్కురాలు ... ...

శీతల్ సేని : తానే శాశ్వతంగా రాజమాతయై, సర్వాధికారాలు తనహస్తగతం చేసుకోవాలనే దురాశతో కుమారుని చేతికి మారణాయుధాన్ని అందించి తాను సారధ్యంవహించిన మహారాణి ... కాదు ... మహామారి. వనవీరునితల్లి. విక్రముని పినతండ్రిభార్య. నలుబదిసంవత్సరములు దాటినవయస్సు

ఉదయసింహుడు : విక్రమసింహుని సవతితమ్ముడు. పదమూడు సంవత్సరముల వయస్సు ... ...

బారి ! రాజభవనంలో వంటమనిషి ... ...

సమయానుకూలంగా రాజనర్తకి, ప్రజాప్రతినిధిలు, రాజగురువు, సైనికుడు ప్రవేశింతురు.



# ప్రయోక్తలకు

ఇతివృత్తం రాజస్థాన్‌లో మహారాణా వంశానికి సంబంధించిన వీరగాథ.

పాత్రధారణ, రంగాలంకరణ, ఆభరణములు, వస్త్రులు మొదలగునవి ప్రాచీనరాజపుత్ర సాంప్రదాయాలకనుగుణ్యంగా నిర్ణయించుకొనుటలో శ్రద్ధ వహించవలయును. రంగస్థలంపై కనుపించే ఉన్నతాసనములపైన, తదితర పరికరములపైన మఖ్‌మల్ గుడ్డలు లేక రంగు గుడ్డలైనా పరిస్తే అలంకరణ ఎంతో బాగుంటుంది,

సంభాషణలకు, సన్నివేశాలకు సరిపడేలాగున వాయిద్యములు నేపథ్యంలోనుండి తగుస్థాయిలో వినిపించిన, నాటకమెంతో రక్తికడుతుంది.

నేపథ్యంలోనుండి జయధ్వానములు చేయునపుడు ఒకరిద్దరితోకాక అనేకమందితో ఒకే స్థాయిలో గంభీరంగా పలికించిన నాటకం పట్టుగానడుస్తుంది.

ప్రజలు సమర్పించుకున్న వినతిపత్రాలు కేవలం కాగితరూపంలో కనుపించకుండ వివిధరకములైన రంగు కాగితములు తామరాకులవలె కత్తిరించుకుని ఉపయోగించిన కొంతవరకు బాగుండును...

విలాస మందిరంలో నృత్యగీతం పూర్తి అయిన తరువాత నృత్యం మాత్రం వేగంగా నడుస్తుంది. నేపథ్యంలో

ప్రజల ఆవేశపూరితమైన సంభాషణలు మూరాన్నించి విన బడుతూనేయుండును. అనుకూలపడితే నేపథ్యంలో H. M. V. లేక B. B. C. Croud record ఉపయోగించ వచ్చును, సింహద్వారం బద్దలైన ధ్వని వినబడినప్పుడే రాజనర్తకి భయబడి విలాసభవనంనుండి పారిపోవును. నృత్యంపూర్తిగా వుండాలని అభిప్రాయపడిన దృశ్యం రాణించదు.

ప్రథమ దృశ్యంలో కర్మచందు ఓర్పుతో సహాయ సద్భావాలు నిరూపించుకొనుట ఎంతో అవసరం. అందుకు సంభాషణలు సాధ్యమైనంత తక్కువస్థాయిలో వుండాలగా మాట్లాడుటకు ప్రయత్నించాలి. పంచమదృశ్యంలో క్రమ క్రమంగా సంభాషణలు ఆవేశంతో గంభీరంగా మాట్లాడిన ఆ పాత్రపోషణ ఎంతో బాగుంటుంది.

కారాగృహపు కటకటాలు దూర మానంగా అమర్చ వలెను. అప్పుడే బందీగావున్న విక్రమసింహుని కదలికలు, కవళికలు ప్రేక్షకులు పూర్తిగా గమనించగలుగుతారు. కటకటాలకు ద్వారం అమర్చి రంగస్థలానికి మధ్యలోవుంచిన ముందుభాగంలో తక్కిన పాత్రధారులు ప్రవేశించి అభిన యించుటకు వీలుగావుండును.

కారాగృహంలో చంచల చిత్తుడైన విక్రమునితో 'పగలు వెనుక రేయేల'' అనే పాటను సంగీత ప్రాధాన్యత లేకుండ, భావయుక్తంగా పాడించిన సందర్భానుసారంగా వుండును.

మూడవసీనులో "ఇదుగో తల్లీ! విక్రముని రుధిర స్రవంతిలో వసంతమాడిన వీరఖడ్గం" నాలుగవ సీనులో "ఈ ఖడ్గంపై మొరసేర క్తం?" అన్నమాటలు వచ్చునప్పుడు స్పాట్ లైటు ప్రయోగించి కత్తిపై రక్తాన్ని చూపించుటకు ప్రయత్నించిన ప్రదర్శన మెంతో బాగుంటుంది.

వసవీరుడు శయ్యపై నిద్రించు కుమారవాణ్ణి హత్య చేసి నప్పుడు పద్మా ఆదృశ్యం చూడలేక దిక్కులు పిక్కటిల్లు నట్లు ఆర్తనాదంచేసి క్రింద పడిపోవలయును, కుమారవాడు కూడా కెవ్వున కేకవైచి తెరపడిపోవునరకు కాళ్ళతో గిలగిల తన్నుకొనవలయును. యీ సన్నివేశంలో వాయిద్యముల భీభీత్సకోలాహలం వినిపించిన ప్రదర్శకులు, ప్రేక్షకుల ఆదరాభిమానములు పొందుటకెంతో అవకాశమున్నది. ఈ దృశ్యానికి ముఖచిత్రి మెంతో సహాయపడుతుంది.



(ఆంధ్రసాహిత్య అకాడమీ ఉపాధ్యక్షులు)

కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ M.A., M.L.C. గారి

# ఆశీస్సులు

శ్రీ కంతేటి వెంకటరామరాజుగారు రచించిన "పన్నా" అన్న నాటకము చూచినాను. అరుణోదయ సంగీత నాట్య మండలివారు దీనిని ఇదివరకే ప్రదర్శించి ప్రశంసలు పొందిరి. రచయిత నటకుడు, గాయకుడు అనగా నాటక ప్రదర్శనానుభవము కలవాడు. ఆయనుభవము కలవారు రచించిన నాటకమునందు ప్రదర్శనయోగ్యత మిక్కిలిగా నుండునని వేరే చెప్పబనిలేదు.

ఇది చరిత్రాత్మక నాటకము. ప్రసిద్ధమైన రాజపుత్రకథ ఇందలిభాష వాడుకభాష. శిష్టమైనభాష. చాలాబాగున్నది. ఈ గ్రంథకర్తకు శతాశీస్సులు.

విశ్వనాథ సత్యనారాయణ

1-2-59, విజయవాడ,

# పరిచయం

శ్రీ సంతేటి వేంకట రామరాజుగారు నాకు చిరపరిచితులు. మంచి నటుడుగా మొదటా, చక్కని గాయకుడుగా తరవాతా నేను వారి నెరుగుదును. ఇప్పుడు నాటక రచయిత అని కూడా తెలుసుకున్నాను.

ఒక్కకళను సాధించడమే కష్టం. అటువంటప్పుడు నటనా, గానమూ, రచనా అనే మూడు ఉత్తమకళలను ఉపాసించే రామరాజుగారు అభినందనీయులు.

రాజస్థాన చరిత్రలో పన్నా చిరంజీవిని, ప్రజలకు ప్రతినిధియైన ప్రభువును రక్షించడం పరమధర్మమని విశ్వసించింది పన్నా. ధర్మరక్షణకోసం, ప్రభురక్షణకోసం, తన కన్నకుమారునినైతం బలియిచ్చిన త్యాగశీలిని పన్నా.

పన్నా రాజభక్తీ త్యాగశీలమూ ఈ నాటకంలో చక్కగా చిత్రించబడ్డాయి. "దేశంకోసం ప్రభువుకోసం, ప్రాణాలర్పించి అమరత్వాన్నిపొందే అదృష్టం నీకు లభించింది." అని హతుడైన పుత్రునిచూసి దుఃఖోపశమనం పొందుతుందావీరమాత. శత్రువు చేతచిక్కినప్పుడు "మానవుడు మానవులను హత్యచేయటమనే అనాచారాలకు స్వస్తి చెప్పాలి." అని అహింసను చాటుతుందా శాంతమతి. పన్నాజీవితం స్త్రీలోకానికాదర్శం.

ఆయాధర్మాల్ని ఈ నాటకంలో ఉదాత్తంగా నిరూపించారీ రచయిత. సంభాషణలు వాడిగా వేడిగా నడుస్తాయి; సన్నివేశాలు వడివడిగా సాగుతాయి. ప్రతిపాత్రా సరిగ్గా

పోషింపబడింది; ప్రతిభావమూ రసవత్తరంగా చిత్రించ బడింది. అరుణోదయ సంగీత నాట్యమండలివారి నాటకాన్ని మనోరంజకంగా ప్రదర్శిస్తున్నారు.

ప్రేక్షకులకు ఉద్రేకమూ ఉత్తేజమూ కలిగించే ఈ వీరరసప్రధానమైన నాటకం రచించిన రామరాజుగారు చరితార్థులు, ఆంధ్రనాటకలోకానికి ఆదరణపాత్రులు.

విజయవాడ, 2-2-59        వింజమూరి శివరామారావు

# ప్రస్తావన

రాజస్థాన కథావళి అనేక రసపుత్రవీరుల సాహస గాథలకు ప్రసిద్ధి. తమ దేశముకోసము, తమ మాన గౌరవముల కోసము ప్రాణములను బలియిచ్చిన రాజపుత్రులతోపాటు తమ మాన సంరక్షణకోసము, రాజసింహాసన రక్షణకోసము అవలీలగా త్యాగముచేసిన వీరమాతలు, వీరపత్నులుకూడ వున్నారు. వీరి జీవితచరిత్రలు ఒక్కొక్కటి ఒక్క నాటకముగా ప్రదర్శించి వీరరసము పోషించుటకు అనువైనది. ఈ కథలు ఇతివృత్తములుగా తీసికొని ద్విజేంద్రలాల్‌రాయ్ "మీవాడు పతనము" "దుర్గాదాస్" మొదలయిన మంచి నాటకాలు రచించినారు. అవి యించుమించు అన్ని భారతీయ భాషలలోనికి అనువాదమునొంది అందరి మన్ననలను అందుకొన్నవి. ఈ నాటకముల ఒరవడిననుసరించి చరిత్రాత్మక కథలతో నాటకము లనేకములు వివిధభాషలలో వచ్చి

నవి. హిందీలో గోవిందవల్లభపంతు, సేఠ గోవిందదాసు మున్నగువారు చరిత్రాత్మక నాటకములనేకము రచించినారు. రాజస్థాన కథావళిలో ఒక ప్రసిద్ధకథ పన్నాధాత్రి త్యాగము గూర్చినది. ఈమె రాజసింహాసనమును అలంకరించవలసిన ఉదయుని రక్షించు నిమిత్తము, తన కుమారుడు చందనుని వానిపాన్పుపై పరుండబెట్టి ఆతనిని వైరికరవాలమునకు ఎఱగా వించినది. తనపుత్రుని ప్రాణములు పోయినవి. ఉదయుడు, మీవాడు రాజకుమారుడు, మిఠాయిగంపలో తప్పించుకొని వచ్చి రాజమకుటమును ధరించుటకు మిగిలినాడు. ఈ యితి వృత్తము నాధారముగా తీసికొని గోవిందవల్లభపంతు "రాజ మకుట్" అని ఒకనాటకము హిందీలో రచించినారు. దానికి ఈ నాటకము స్వేచ్ఛానుసరణ.

పన్నా నాటకము రచించిన వేంకట్రామరాజుగారికి నాటకరచన క్రొత్త; కాని రంగస్థలనటన, నిర్వహణ వారికి క్రొత్తకాదు. అందుచేతనే వారికృషి ఫలించినది. ఈ నాటకములో ఆరు అంకములు. ఆరు రంగములు అనగా ఆరుసారులు తెరలాగిన చాలును. దృశ్యములుకూడ ఎక్కువ మార్చవలసిన అవసరముండదు. ప్రధాన పాత్రలెక్కువలేవు. కానిరాజపుత్ర దుస్తులు ఆభరణములు అలంకరణములు అవసరమగును. ప్రతి దృశ్యములోనూ "సంఘర్షణతో" కూడిన సన్నివేశములతోపాటు, ఉత్కంఠకలిగించి ముందు ఏమిజరుగనున్నదోయని ఉత్సుకత రేకెత్తించు సందర్భములుకూడ అనేకమున్నవి. "నాటకీయత" అడుగడుగున ప్రతిబింబించి రంగస్థలముమీద సంఘటనలన్నీ ప్రేక్షకులను తన్మయులను చేయుచు, చక్కని వేగముతో రక్తికట్టుచు పోవును.

ఆయా సందర్భమునను సరించి కొన్ని పాటలుకూడ చేర్చి వచన నాటకమునకు మరికొంత ఆకర్షణ తెచ్చినారు. అయితే గద్యశైలి మొదటినుండి చివరవరకు ఒక సమాన పాటవము ప్రదర్శించలేదు. ఒక్కొక్కసారి గ్రాంథిక వైఖరిని మరొకసారి వ్యావహారిక పద్ధతిని అనుసరించినది. వాచకాభినయములో ఆయాపాత్రలు వారి వారి ధోరణినిబట్టి ఈ భాషను తమకు అనుగుణముగా మలచుకొన్నవి. అందుకేనేమో రంగస్థలముమీద ప్రదర్శించినపుడీ నాటకము ప్రేక్షకుల నెక్కువగా ఆకర్షించినది. ఇటీవల తెనుగు నాటకరంగస్థలములో సాంఘిక సమస్యలకున్న ప్రాముఖ్యము చరిత్రకథలకు లేనిలోపము తీర్చుటకు ఈ నాటకమువంటివి వచ్చిన ప్రేక్షకులు ఆదరించగలరనుటకు సందేహములేదు. ఈ విషయములో ఈ నాటకమును తెనుగునాట ప్రదర్శించి ప్రశంసలందిన అరుణోదయ సంగీత నాట్యమండలివారు అభివందనీయులు,

చరిత్రనాటకముల ధోరణిలో పద్య గద్యాత్మకమై అనేక రంగములతోనూ పాత్రలతోనూ అసాధ్యము కాకుండ ఈ "పన్నా" నాటకము అభినయించుటకు వీలయిన అన్ని హంగులను సమకూర్చుకొన్నది. అందుకే ఇది అందరి అభిమానమును చూరగొనగలది.

శ్రీ వాత్సవ

# పన్నా

## ప్రథమాంకము

చిత్తూరు మహారాణా విలాసమందిరం. విశ్రాంతిగా కూర్చుండుటకు ముఖమల్ దిండ్లు, పట్టుబాలీసులతో అమర్చిన ఆసనం. ప్రక్కనే పానపాత్రలు, ద్రాక్షరసాలు, వివిధములైన మధురఫలాలు ద్రాక్షగుత్తులతో ఒకపాత్ర ఉంచబడును. ఒక నగిషీ చెక్కడంలో పిలుపుగంట వ్రేలాడుతుండును. మూలలందు నిలువెత్తు నగిషీబల్లలపై పూలపాత్రలుగాని, సింహము, పులులు మొదలగు బొమ్మలతోగాని, అలంకరించియుండును. నిలబడి కాలానించుటకు ఒక పీట వుంచబడును. నేలపై పరచిన రంగురంగుల తివాచీ కనిపించును. మహారాణా విక్రమసింహుడు సర్వాభరణాలంకృతుడై కిరీటము ధరించి, దర్బారునకు వెళ్ళవలయుననిబయలుదేరి రంజిత్ సింహుని మాయమాటలకు లోనై భోగవిలాసములకొరకు విలాసమందిరములో ప్రవేశించును. వినతిపత్రములు చదువుతూ చదివిన వినతిపత్రాన్ని నలిపి క్రిందపడవేస్తూవిక్రమసింహుడు విలాసమందిరములో ప్రవేశించును. ఇంకా తనచేతిలో మిగిలియున్న పత్రములన్నియు చిరాకుతో మందిరమంతా విరచిమ్మి...

విక్ర : రంజిత్!

రంజి : ప్రభూ!

విక్ర : దర్బారుకు వేళ అయిందనుకుంటాను...

రంజి : విలాసభవనంలో కూడా వినతిపత్రాలు చూస్తూంటే విశ్రాంతి ఎక్కడ ప్రభూ ?

విక్ర : పీడితప్రజల వినతిపత్రాలతో రాజభవనమంతానిండి పోయింది. మహారాణా పరిపాలనలో ప్రజానీకం నిర్విచారంగా వుండాలి, సామంతదండనాథులను ప్రవేశ పెట్టి దర్బారు ఏర్పాట్లు పూర్తిగావించు రంజిత్!

రంజి : మహారాణా పరిపాలనలో ప్రజానీకం సుఖంగా జీవిస్తున్నారు. రాజకీయవిద్రోహులు కొందరు చేరి, అమాయిక ప్రజానీకాన్ని రెచ్చకొట్టి తమ స్వప్రయోజనాలకు వినియోగించుకుంటున్నారు. ప్రభుత్వాన్ని విమర్శించటమే విధిగాపెట్టుకొన్న విద్రోహుల విషమ ప్రచారానికి ఫలితమే ఈ వినతిపత్రాలు ప్రభూ!

విక్ర : జన్మభూమికి ద్రోహంతలపెట్టే దేశద్రోహుల్ని ...

రంజి : కఠినంగా శిక్షించాలి.

విక్ర : ఔను ... నేటి దర్బారులో ఈ విషయమై దీర్ఘంగా చర్చించాలి.

రంజి : వంశపారంపర్యంగా రాజసౌధంలో పొట్ట నింపుకొనే వారే ...

విక్ర : చిచ్చుపెట్ట సాహసించారుకదూ !

రంజి: ఔను ప్రభూ!

విక్ర : ఎవరారా నీచులు?

రంజి ; త్వరలోనే బయట పడతారు. ఈ మధువునందుకోండి (మధువును అందించును.)

విక్ర : (మధుపుత్రాగుతూ) రంజిత్! ఈమధువుత్రాగుతుంటే
రంజి : ఎంతో ఆనందంగా ఉంటుంది ప్రభూ!
విక్ర : ఓహో! అల్పమైన ఈ మానవజీవితంలో దుఃఖాన్ని దూరంచేసి అన్ని సుఖాలు అనుభవించాలికదూ?
(కిరీటాన్ని, ఖడ్గాన్నితీసి ఒక బల్లపై ఉంచును.)
రంజి : ఔను ప్రభూ! మీ ఆనందమే ప్రజల ఆనందం మీ సుఖమే ప్రజల సుఖం
విక్ర : అహ్హా హ్హా హ్హా హ్హా !!!! అంతేనంటావా రంజిత్!
రంజి : చిత్తం ప్రభూ!
విక్ర : ఆ (...అయితే నిండుహృదయంతో మరొక్కసారి ...
రంజి : (మధునందిస్తూ) వినోద విన్యాసాలతో విలసిల్లే ఈ విలాస మందిరాలు యిట్లు నిర్జనమైపోవుట మన దుర దృష్టం మహారాణా!
విక్ర : ఔను రంజిత్
రంజి : అమరనాట్య ముద్రికలతో విరాజిల్లుచుండే ఈవిలాస మందిరాలు రాజకీయాలకు రంగస్థలములగుట దేశానికి, ప్రజలకు శ్రేయోదాయకంకాదు.
విక్ర : ఔను.
రంజి ; మీ పూర్వులు ఆరాధించిన కళకు, రసికత్వానికి లోటు రానీయవద్దు ప్రభూ!
విక్ర : అట్లైనన్నటికినీ జరుగదు రంజిత్!
[రంజిత్ ప్రక్కనున్న గంటకొట్టగా రాజనర్తకి ప్రవేశించి, నృత్యమారంభించును. విక్రముడు ఆసనమువీడి

[ప్రక్కకువచ్చి ఎత్తుపీటపై కాలూనించి, నాట్యాన్ని చూస్తూ ఆనందంగా వుండును. నేపథ్యంలో నృత్య గీతం శ్రావ్యంగా వినిపించును. రంజిత్ మధ్య మధ్య ప్రభువుకు పానీయాన్ని, ద్రాక్షలు అందిస్తూ ఉండును]

## నృ త్య గీ త ం

మరపురాని యీ రేయి
మరల మనకు రాదోయి
వెన్నెల రేయి హాయి
వెన్నెల రేయి హాయి ॥మరపు॥
ప్రాయము విరిసె ప్రణయ రేఖలు
మెరుపులు మెరిసేనోయి
వెన్నెలలోని కన్నెవలపులు
కాంచగ రావోయి ॥మరపు॥
జిలిబిలి కమ్మని పాటగా
వలపుల పువ్వుల తోటగా
కలకల నవ్వుల మూటగా
గలగల మువ్వల ఆటగా ॥మరపు॥

(నేపథ్యంలో భయంకర కోలాహలం, నృత్యం జరుగుతూనే వుండును.)

నేపథ్యం1 సింహద్వారం తెరవండీ
నేపథ్యం2 మేము ప్రభువును చూడాలి
నేపథ్యం3 మా కష్టాలు మొర పెట్టుకోవాలి

ద్వారపాల (నేపథ్యం) ప్రభువులు విలాసమందిరంలో విశ్రాంతి పొందుతున్నారు. వారి దర్శనం లభించదు.

నేపథ్యం1 ప్రజలంతా మలమల మాడి ఆకలితో అల్లాడిపో తుంటే ప్రభువు విలాసమందిరములో విశ్రాంతిగా ఆనందాన్ని అనుభవిస్తున్నాడా!

నేపథ్యం2 పహరావాళ్ళను వధించండి.

నేపథ్యం3 సింహద్వారం బ్రద్ధలు కొట్టండి.

[నేపథ్యంలో సింహద్వారం, బ్రద్ధలైనధ్వని వినిపించును. ఆవేశపూరితమైన ఆకోలాహలం క్రమంగా దగ్గరలో వినిపించును. నృత్యంచేస్తున్న రాజనర్తకి భయపడి పారిపోవును. ఇంతలో యిద్దరు ప్రజాప్రతినిధులు పరుగుపరుగునవచ్చి నేలకూలబడి]

ప్రజా1 క్షుద్బాధనుండి రక్షించాలి ప్రభూ!

ప్రజా1 మహామారి ప్రళయతాండవం చేస్తున్నది ప్రభూ

విక్ర : అహ్హా హ్హా హ్హా హ్హా !!!! రక్షణ! ఎలాంటి రక్షణ? (ఖాళీగాఉన్న మధుపాత్రనువంచి) పాత్రలో మధువు కూడా నిండుకున్నది. మీకిచ్చుటకు రక్షణలేదు,... పోండి.

ప్రజా1 మా కష్టాల్ని సావధానంగా వినాలిప్రభూ!

విక్ర : మీ కష్టాల్నివినే సమయముకాదిది.

రంజ : ప్రభువులకిది ఆనందసమయం అంతరాయము కల్గించక వెళ్ళిపోండి.

ప్రజా2 జారత్వం, చోరత్వం, దోపిడీలు అరికట్టండి ప్రభూ!

ప్రజా1 దేశమంతా అకాలచ్ఛాయల్లో పరుగుపడిపోయి క్షామ దేవత ప్రళయతాండవం చేస్తున్నది. పంటలు లేవు, మా బిడ్డలు మేము ఆకలితో అల్లాడిపోతున్నాము. ప్రభువులు కరుణించకపోతే...

రంజి : ప్రభువుల సింహాసనాన్ని తలక్రిందులు చెయ్యాలనే దేశద్రోహుల ముఠాలో సభ్యులుగా చేరండి... పొండి

విక్ర : (కత్తిదూసి) ఎవరా దేశద్రోహులు? వాళ్ళ శిరస్సులు నరికి మేవాడ సింహాసనంముందు గుట్టలుగా పేర్చి వేస్తాను.

రంజి : శాంతించండి ప్రభూ!

విక్ర : (ఖడ్గాన్ని మరల యథాస్థానమునందుంచును)

రంజి : (ప్రతినిధులవైపుచూచి) మలమలమాడి ఆకలి దేవతకు ఆహుతైపొండి. మేము సంతోషిస్తాం, అనావృష్టి వల్ల పంటలు పండకపోతే ప్రభువా బాధ్యుడు? వర్షాలు కురిపించి మీ పొట్టలు నింపటానికి మేవాడ మహారాణా మేఘరాజు కాదు.

ప్రజా2 పన్నులు చెల్లించలేదని మా యిల్లు వాకిళ్లు దోచుకొని మమ్మల్ని అడవుల పాల్జేశారు.

ప్రజా1 అంత నిరంకుశమా ప్రభూ?

రంజి : తలదాచుకొనుటకు చోటులేకుంటే పాడుపడిన దేవాలయాలు చాలా ఉన్నవి... పొండి... పన్నులుమాత్రం విధిగా చెల్లించవలసిందే.

ప్రజా2 (ఇద్దరూ లేచి నిలబడి) నీలాంటి సర్దారులుండబట్టే సుక్షేత్రమైన మేవాడరాజ్యంలో పుణ్యక్షేత్రాలు,

దేవాలయాలు పాడుబడి, దిక్కులేనివాళ్లకు, కళ్లులేని కబోదులకు నివాసయోగ్యమవుతున్నాయని ఇప్పు డిప్పుడే ప్రజలు గ్రహిస్తున్నారు.

రంజి : చూశారా ప్రభూ! దిక్కులేనివాళ్ళమంటూ, పొట్ట కూటికై వచ్చి యెలాంటి పెద్దమాటలు మాట్లాడు తున్నారో!

ప్రజా1 పొట్టకూటికై మీవద్ద తిరిపమెత్తటానికి రాలేదు.

విక్ర : మరి దేనికి వచ్చినట్లు?

ప్రజా2 మా బిడ్డలకు మాకు న్యాయభిక్ష పెట్టమని వచ్చాం.

విక్ర : మా పరిపాలనావిధానమంతా న్యాయసమ్మతమైనదే. మేం చేస్తున్నదంతా ప్రజల సుఖంకోసమే.

ప్రజా1 మీ యెండమావుల్లాంటి మాటలు మమ్మల్ని తృప్తి పరచలేవు.

ప్రజా2 అన్యాయం, అధర్మం సంగ్రామసింహునితోనే అంత రించింది. ఆనాడే మేవాడ సూర్యుడస్తమించాడను కున్నాం.

రంజి : మీకు న్యాయం కలిగించటానికిది న్యాయస్థానమను కున్నారా?

ప్రజా1 న్యాయం కలిగించటానికి మీకు న్యాయస్థానమే కావాలా?

ప్రజా2 మీ పరిపాలనలో న్యాయానికి స్థానమెక్కడున్నదో చెప్పండి?

విక్ర : నామనసుస్సు నృత్యగీతంలో లీనమై స్వర్గసీమల్లో విహరించే సమయాన నరకద్వారాలు తెరిచావు ... ఛండాలులు.

రంజి : ఊఁ—ఇకచూస్తారేం? పొండి! ప్రభువులకిది విశ్రాంతి సమయం (ద్వారంవద్దకెళ్లి) ఎవరక్కడ!

ప్రజా1 పహారావాళ్ళను వధించాం.

విక్ర : ఆ!...పహారావాళ్ళనే వధించారా?

ప్రజా2 ప్రభువుల దర్శనభాగ్యంకోసం

విక్ర : మీరింక బ్రతికి పోగలరా?

ప్రజా1 మీదుష్ట పరిపాలనలో బానిసలుగా బ్రతికేకంటే వాడిగల మేవాడఖడ్గానికి బలైపోవుటే మాకిష్టం

విక్ర : (కత్తిదూసి) బదులు మీరెండు ప్రాణాలు నిక్కడే తీస్తాను. సిద్ధంగా వుండండి.

కర్మచంద్: ప్రవేశించి ఆగండి మహారాజా!

విక్ర ; ఎవరు?

కర్మ : ఆకటి మంటలో మలమల మాడిపోతూ రక్షణకోసం వచ్చినవారి శిరస్సులపైనా మీఖడ్గం?

విక్ర : ప్రధానమంత్రి?

కర్మ ; నిర్దోషుల రక్తాన్ని చిందించిన తరువాత మీరు చేయునది?

విక్ర : ఇదిరాజ్యసభ కాదు!

కర్మ : విలాసమందిరమని మాక్కూ తెలుసు.

విక్ర ; ఈ హంతకుల రెండు శిరస్సులూ, [illegible]ణంలో

దుమ్ము తినవలసిందే.

కర్మ : ఈ సింహాసనం మీకే శాశ్వతమనుకోవద్దు. మేవాడ ప్రజానీకమంతా తమ భుజాలపై దీని బరువుభారం వహిస్తున్నది. జాగ్రత్త! మీరు మీ కర్తవ్యాన్ని మరచి సంచరిస్తున్నారు. మరి నాకర్తవ్యాన్ని నేను మరువజాలను.

విక్ర : నా స్వేచ్ఛకు నా ఆనందానికి అడ్డు వచ్చేవాళ్లే నా ఖడ్గానికి మొట్టమొదట బలి

కర్మ : అదే మీనిర్ణయమైతే నిర్విఘ్నంగా కొనసాగించండి మేవాడ సేవలో యీగడ్డం పండిపోయింది. వంగిన శిరస్సు నింకానంచుతాను. మీభుజాల్లో శక్తివుంటే మీకత్తికి పదునుఉంటే ఒక్కవేటుతో నాశిరస్సు రాలిపోవాలి. మీ నిర్ణయాన్ని సాధించండి ప్రభూ! (ప్రభువుముందు తలవంచును,)

విక్ర ; (కత్తిదూసి) కర్తవ్యసాధనకు నా ఖడ్గం సిద్ధంగానే వున్నది.

జయసింగు: (ప్రవేశించి కత్తిదూసి విక్రమునిపై కురుకుచూ) ఆగు మూర్ఖుడా!

వనవీరుడు: (ప్రవేశించి కత్తిదూసి జయసింగుతో తలపడి) జయసింగ్! జాగ్రత్త! విక్రముడు నాసోదరుడు

విక్ర : అహ్హా హ్హా హ్హా హ్హా హ్హా !!!!

వన : ముందు నా ఖడ్గధారను జయించి, తరువాత విక్రముని.

కర్మ : (జయసింగు చేయిపట్టుకొని) శాంతించు జయసింగ్!

జయ : నాకన్నతండ్రికి జరిగిన అవమానాన్ని భరించలేను. నా కర్తవ్యాన్ని పాటించాలి.

కర్మ : జయసింగ్! తండ్రికి జరిగిన అవమానానికి నీ వొక్క-డవే బాధపడనవసరంలేదు. నాయనా! యీవిక్రముని బాల్యమునుండీ నాఒడిలో పెంచి పెద్దవాణ్ణి చేశాను. విక్రముడు నీవలె బిడ్డతో సమానం.

జయ : ఊహు! బిడ్డ!...

కర్మ : ఖడ్గాన్ని పైకెత్తగలడేగాని నా రక్తంలోని ఆక్రందనాన్ని తాను భరించలేను. ఆవేశాన్ని అదుపులో పెట్టునాయనా!

జయ : నేను సహిస్తాను. లక్షలాది నిరుపేద హృదయాల్లో రగుల్తున్న అగ్నిజ్వాలల్ని శాంతిపచేదెవరు?

కర్మ : తొందరపడవద్దునాయనా?

జయ : అలా రాజభవనముందుకు వెళ్ళి చూడండి, ప్రజల దీనస్థితి మీకర్థమౌతుంది. వాళ్ళ ఆక్రందనాలు వింటుంటే మేవాడ భవిష్యత్తు తెలిసిపోతుంది. ప్రజలు ఎంతవరకు ఓర్పు వహిస్తారు? (ప్రజాప్రతినిధులతో) మీ కళ్లయెదుట ప్రధానమంత్రి కిలాంటి గౌరవం జరిగింది. ఇక రాజుహృదయంలో మీకెలాంటి స్థాన ముందో ఆలోచించండి. మేవాడ సింహాసనం న్యాయ రహితమైన ప్రభువులు అధిష్ఠించటానికేనా!

ప్రజా2 అంతకంటె శూన్యమే మేలు.

ప్రజా1 మాకు ప్రజాపరిపాలన కావాలి.

విక్ర : ప్ర...జా...పరి...పాలన...ఊహుఁ...
జయ : అది విక్రమునివల్ల కాదు. పాలితుల రక్తంత్రాగే ప్రభువులకు...
అందరూ: స్వస్తి చెప్పాలి.
కర్మ : జయసింగ్! ఏమిటీతొందరపాటు?
జయ : తండ్రికిజరిగిన పరాభవానికి నా ప్రతీకారనిర్ణయం. ఇంక తిరుగులేదు. రండి...
కర్మ : జయసింగ్! ...
జయ : రండి ...
కర్మ : జయసింగ్ ...
జయ : మేవాడ ప్రజలు సుఖజీవనం తిరిగి పొందాలంటే నా వెంటరండి (దురుసుగా వెళ్లిపోవును)
కర్మ : జయసింగ్ ...
నేపథ్యంలో : సర్దార్ జయసింగ్ జయహో; సర్దార్ జయసింగ్ జయహో, సర్దార్ జయసింగ్ జయహో.
(జయసింగు వెంట ప్రజా ప్రతినిధులు కర్మచందు నిష్క్రమింతురు)
విక్ర : (అందరూ వెళ్లుతున్న దిక్కుకు ఆవేశంతో చూస్తూ వుండును)
వన : విక్రం! ప్రభుత్వపతనానికి ఎలాంటి శక్తులు కేంద్రీకరిస్తున్నవో విచారించి వస్తాను (నిష్క్రమించును)
విక్ర : అంతా వెళ్ళిపోయారు...రంజిత్! మరి...నీవు!...

రంజి : రంజిత్ వెళ్ళవలసిన అవసరంలేదు ప్రభూ! రంజిత్ ప్రభుభక్తిపరాయణుడు (కొంచెంసేపు ఆలోచించి) ప్రభూ! మీకిష్టమైతే విద్రోహుల చర్యలు రహస్యంగా ఉండి సేకరిస్తాను ... నేనుకూడా ...

విక్ర : వెళ్లు ... నీవుకూడా వెళ్లు రంజిత్ !

రంజి : (నిష్క్రమించును)

విక్ర : నేను సురాదేవి నారాధిస్తూ ఏకాంతంగా వుండి పోతాను. ఈ విక్రముడు యింకెవ్వరికీ భయపడడు. సర్దారులంతా విద్రోహులైనారు. ప్రజలంతా విరోధులైనారు. ఇక మిగిలింది ఎవరు? ఆ... (సురాపాత్ర దగ్గరకు వెళ్లబోవును)

శీతల్ సేని: (ప్రవేశించి) నే నే...

విక్ర : ఎవరూ!

శీత : రాణీ శీతల్ సేనిని

విక్ర ; రాణీ... శీతల్ ... సేని ... అహ్హా హ్హా హ్హా హ్హా !!!!

శీత : ఎందుకంత హేళన? నేను మీ పినతండ్రి పృధ్వీరాజు భార్యనని, మాదీరాజవంశమే అనేమాట మరచినావా!

విక్ర : లేదు. మీరు వచ్చినకారణం?

శీత : భిక్షాటనకు రాలేదు.

విక్ర : మరి ... దేనికివచ్చినట్లు?

శీత : మా న్యాయమైన హక్కుకోసం

విక్ర : ఏమిటది?

శీత : మీ తండ్రి సంగ్రామసింహుడు నిర్ణయించిన రాజ

లాం ధనాలు మాకు చెందని కారణం?

విక్ర : భుక్తి కేమయినా లోటువచ్చిందా?

శీత : అది నీకనవసరం

విక్ర : కావచ్చు.

శీత : మాకు చెందని కారణ మడుగుతున్నాను?

విక్ర : ఇది సమయముకాను, మాధనాగారాలు నిండుకున్నవి.

శీత : నేను సహించను నీ అన్యాయం హద్దుమీరిపోతున్నది.

విక్ర : రాజవాసానికి హద్దులేదా!

శీత : మాకు చెందవలసిన ధనాన్నంతా నీ విలాసాలకు వినియోగించి విర్రవీగుతున్నావు... సిగ్గులేదూ!

విక్ర : ఎవరియెదుట నీ అధిక ప్రసంగం?

శీత : ఒకదుర్మార్గుని యెదుట, ఒకదొంగ యెదుట, ఒక హంతకుని...

విక్ర : ఆగు. రాక్షసీ... చండాలీ... నీవంశాన్నే మరచి మాట్లాడుతున్నావు... దాసీ...

శీత : ఆదాసి నిన్నుపెంచి పెద్దవాణ్ణి చేసింది, ఆ చండాలి నీ పినతండ్రి ధర్మపత్ని, ఆరాక్షసి నీరాజమాత, గతాన్ని విస్మరించి విషనాగుతో చెలగాట మాడుతున్నావు.

విక్ర : విషనాగుకోరలు పిండుతాను జాగ్రత్త.

శీత : రాచరికపు గర్వంతో ఒళ్లు తెలియక సంచరిస్తున్నావు. నీ కిరీటాన్ని చూర్ణంచేస్తాను, నీసింహాసనాన్ని బ్రద్దలు కొడతాను, సంగ్రామసింహుని వంశాన్ని సర్వనాశనం చేస్తాను. జాగ్రత్త! (దురుసుగా వెళ్ళిపోవును)

పన్నా: (లోపలినుండి ప్రవేశిస్తూ శీతల్‌సేని వెళ్ళుచున్న వైపుచూచి) ఎవరాభయంకర నాకీనాదం! ... ఎవరా భయంకర అభిశాపిని! సర్వనాశనం చేస్తావా రాక్షసీ! నీ దుర్మార్గానికి నా ప్రాణాన్ని బలియిచ్చి మరీ యెదుర్కుంటాను, సంగ్రామసింహుని వంశ నాశనానికి నీవు మహామారిగా తయారయ్యావు, మేవాడరాజ్యానికి చిచ్చుపెట్టావు, నా రక్తంతోనే ఆర్పివేస్తాను.

విక్ర : పన్నమ్మా !

పన్నా: ప్రభూ !

విక్ర : చూస్తున్నావా యీ విపరీతం ?

పన్నా: చూట్టమేకాదు వింటున్నానుకూడా ప్రభూ !

విక్ర : అమ్మా! ఈనాటికి బంధువులు, స్నేహితులు విరోధులైనారు, నేటికి సామంతులు, సర్దారులంతా నాపై కత్తిగట్ట సాహసించారు, యీ క్షణంలో మేవాడ సర్వస్వం నన్ను శత్రువుగా చూస్తున్నది. అంత ప్రబలకారణ మేమిటో నాకర్థం కాలేదమ్మా !

పన్నా: దైవనిర్ణయానికే కట్టుబడి వుందాం, విచారించవద్దు ప్రభూ !

(ప్రక్కనున్న మధుపాత్రలుచూస్తూ పన్నాదుఃఖిస్తూ వుండును)

విక్ర : దాయమ్మా ! ఎందుకలాదుఃఖిస్తావు ?

పన్నా: రాణావంశంలో యెన్నడూ యెరుగని విపరీతవ్యసనాలకు దాసులైపోతున్నారా ప్రభూ ! శత్రుసైన్యాలరక్తం త్రాగి, మీ తండ్రి సంగ్రామసింహ మహారాజు రణరంగంలో వీరవిహారం సల్పిన రణసింహులేగాని యీనిషాలకు, యీ పానీయాలకు దాసానదాసులై వాసనాదేవిని వరించలేదు ప్రభూ ! చిత్తూరుకోట గవాక్షములు శాశ్వతంగా తెరచి ఉంచాలని మీతండ్రిగారి ప్రతిజ్ఞ, వారి జీవితంలో విశ్రాంతి యెరుగరు. విరామంలేదు. అహర్నిశలూ అశ్వారూఢులై కత్తిబట్టి కదనభూమిలోనే కాపురముంటూ కాలం వెళ్ళబుచ్చారు. కణ్వాహా, మహాసంగ్రామంలో ఒక కన్ను పోయింది, కాళ్లు, చేతులు విరిగినవి, శరీరమంతా తూట్లుపడిపోయింది. వంశప్రతిష్ఠకొరకు వెన్నుజూపక సమరభూమిలోనే శత్రుకళేబరములతో నమర్చిన పాన్పుపై పరుండి మీ తండ్రిగారు పరలోకగతులైనారు. రాజపుత్రుల బలపరాక్రమములు క్షీణించినవి, చిత్తూరుకు అంత్యకాలమాసన్నమైనది, జన్మభూమి మ్లేచ్ఛుల హస్తగతమగుట సహించలేక మీతల్లి జహ్వారీబాయి కవచధారిణియై పురుషవేషంలో పగవారి నెదుర్కొని వీరస్వర్గాన్ని అలంకరించింది. శత్రు ఫిరంగుల ధాటికి చిత్తూరు కోటగోడలు కూలిపోయినవి, విరోధి సైనికులు, వీరావేశాలతో ప్రవాహవేగంగా వచ్చి దుర్గంలో ప్రవేశించారు, ఇంక గత్యంతరంలేక మీ సవతితల్లి కర్మాదేవి పొత్తిళ్ళలోని ఉదయసింహుని

నాచేతికందించి పదమూడు వేల రాజపుత్రికలతో అగ్ని గుండంలో దూకి ఆహుతై పోయింది. ఒక్కసారి మీ వీరవంశాన్ని జ్ఞప్తికి తెచ్చుకోండి. అలాంటి పవిత్ర మైన మీ వీరచరిత్ర, ఈ విలాసభవనాల్లో నాట్యకత్తెల కాళ్ళక్రింద నలిగిపోవలసిందేనా ! (పాన పాత్రను చూపిస్తూ) ఈ కాలకూటవిషంలోముంచి మహారాణా వంశాన్ని అపకీర్తిపాల్జేస్తారా ప్రభూ! మీదాయమ్మ యింతగా మాట్లాడినందుకు ఆవేదన పడుతున్నారా! క్షమించండి ప్రభూ !

విక్ర : లేదమ్మా! వీరగాధలు వింటుంటే మా తల్లి జ్ఞప్తికి వచ్చింది. నీ అమృతవాణి నాకు వెలుగుబాట వేసింది. నేటినుండి నా మాతృదేవి మేవాడ సాక్షిగా ఈ మధువు నిషేధిస్తాను. నన్ను ఆశీర్వదించు తల్లీ!

ఉదయుడు: (ప్రవేశించి నలుదిక్కులాచూచి) దాయమ్మా! యీరోజు విలాసమందిరం చిన్నబోయింది?

పన్నా: ఉదయ్! చందనకుమారుడేడీ నాయనా?

ఉద ; రాజభవనంముందు జనసమూహాన్ని చూస్తున్నాడు.

విక్ర ; జన సమూహమా!

ఉద ; ఔను ప్రభూ! జనం గుంపులు గుంపులుగా మైదాన మంతా నిండిపోయారు. మంత్రులు, సర్దారులు, ప్రజలు అందరూ అక్కడే తర్కించుకుంటున్నారు. అంతా ఒక దర్బారులాగున్నది.

పన్నా; ఔను! నేటివరాబ్జన్ల మైదానాల్లోను, న్యాయస్థానాలు నడిపేథుల్లోను, తీర్పులు కసాయికత్తులతోను పరిష్క-రించబడుతున్నవి.

ఉద ; దాయమ్మా! సామ్రాట్టుపై ప్రజలకంత కోపమెందు కమ్మా?

పన్నా; కారణమేంటో తెలియలేదు. అయినా నీవు పసివా డవు, యీ రాజకీయాలు నీకర్థంకావు.

విక్ర ; నేటి రాకుమారులకు రాజకీయాలుకూడా అత్యవసరం పన్నా! ఉదయ్! ఇలారా! నాయనా! నాశిరస్సు నే భరించలేక నాభుజాలు కృంగిపోతున్న దుర్బలత్వంలో యీ మేవాడ రాజమకుటాన్ని ధరించలేను.

ఉద ; ఈరోజు చాలా వింతగా మాట్లాడుతున్నారు మహా రాణా!

పన్నా; నిశ్చింతగా వుండండి ప్రభూ!

విక్ర : నన్ను రాజ్యభ్రష్టుణ్ణిచెయ్యాలని సర్దారులంతా కుట్ర పన్నుతున్నారు, అమాయికప్రజానీకాన్ని, రాజభవ నంపై ద్వేషన్యానికి రెచ్చగొట్టారు, రాజ్య కాం క్షతో అసూయాపరులైన రాజబంధువులందరూ నాపై తిరుగుబాటుకు సిద్ధపడుతున్నారు. ఒకరేమిటి అవకాశవాదులందరూ నేడు పగసాధించాలనే ప్రయ త్నంలో ఉన్నారు. కిరీటాన్ని అలంకరించిన శిరస్సు వంచుట మహారాణా వంశానికే అపకీర్తి. ఉదయ్!

చేతినుండి యీ కిరీటాన్ని నీవే ధరించి పరిపాలనా బాధ్యత స్వీకరించు, వజ్రవైఢూర్యాది నవరత్నములు పొదిగిన యీ కిరీటచ్ఛాయల్లో మేవాడ ప్రజానీకానికి విశ్రాంతి చేకూర్చు ఉదయ్ !

ఉద : మీరు ధరించలేని యీ రాజమకుటాన్ని, పరిపాలనా బాధ్యతను నేను స్వీకరించగలనా ప్రభూ !

విక్ర : మేవాడ ప్రజల సుఖంకోసం తప్పక స్వీకరించాలి నిన్ను పెంచి పెద్దచేసిన మన దాయియమ్మ యున్నది.

పన్నా : (దుఃఖస్తూవుండును)

విక్ర : దాయమ్మా ! ఎందుకలా దుఃఖిస్తావు రాణావంశానికి రక్షణభారం వహించిన నీవే దుఃఖిస్తున్నావా ! నీవే మాకు రాజమాతవు ఉదయసింహుడు పట్టాభిషిక్తు డయ్యే వరకూ యీ రాజమకుటాన్ని నీవే భద్రపర చాలి. (మకుటాన్ని పన్నా చేతికందించబోవును)

జయ : (ప్రవేశించి) ఆగండి ! అది పెండ్లి ఆభరణంకాదు మీయిష్టమొచ్చినవారి చేతికందించి అలంకరించటా నికి, అది మేవాడ రాజ్యలక్ష్మి శిరోభూషణం. మేవాడ ప్రజానీకపు ఆశాజ్యోతి. దాన్ని అపవిత్రం చేయ కండి. ప్రజానిర్ణయానికి కట్టుబడండి.

విక్ర : ప్ర...జా...ని.ర్ణ.యం...ఏమిటా ప్రజానిర్ణయం ?

జయ : రంజిత్ !

రంజి : (అభియోగపత్రాన్ని తీయును)

విక్ర : రంజిత్ ! నీవేనా మాపై అభియోగాలు వినిపించేది?

రంజి : ఔను! (అభియోగపత్రం చదువుతూ) మహారాణా విక్రమసింహుడు భోగవిలాసాలకు దాసుడై, వేశ్యాలోలుడై, పీడితప్రజల కష్టాలు వినుటకు, మంత్రులతోను, సర్దారులతోను, ప్రభుత్వవిధానాన్ని చర్చించుటకు దర్బారుకు హాజరగుటలేదు. రాత్రింబవళ్లు విలాసభవనాన్ని అంటిపెట్టుకొని, సురాపానీయాన్ని సేవిస్తూ, ప్రజాక్షేమానికి ఖర్చుపెట్టవలసిన ధనాన్నంతా దుర్వినియోగపరిచారు, ప్రజలకష్టాలు మొరపెట్టుకొనుటకు వచ్చిన ప్రతినిధులపై కత్తిదూశారు. దేశంలో కరువు, కాటకాలు, భయంకర జాడ్యాలు, దోపిడీలు, దౌర్జన్యాలు మితిమీరిపోయినవి. ప్రభువులు తన బాధ్యతలు విస్మరించుటవలన మంత్రులు, సర్దారులు, సైన్యాధిపతులు అప్రమత్తులై ప్రజాభిప్రాయం సేకరించి నిర్ణయించిన ప్రకారం రాణా విక్రమసింహునకు కారాగార ... శిక్ష,

పన్నా: ఇదంతా అన్యాయం, కుట్ర, ప్రభువులపై మోపిన అభియోగాలు సరైనవికావు. వాటికి మీరే బాధ్యులు, మీ అమాత్యులు, సర్దారులలో కొందరు స్వార్థపరులు ప్రక్కనచేరి పదవులకోసం, ధనంకోసం ఆశపడి ప్రభువును పెడమార్గానపట్టించారు. అసభ్యమైన విలాసాలు సృష్టించి క్రమశిక్షణ, కట్టుబాట్లు మంటగలిపి పరిపాలనావిధానాన్ని స్తంభింపజేసారు. దీనికి బాధ్యులెవరో మీరే ఆలోచించండి !

జయ : సైనికులారా ! విక్రముని బంధించండి.

సైని : (ముందుకు రాగా)

పన్నా: (కైజారుతీసి) ఆగండి ! అడుగు ముందుకు వేశారా చిత్రవధ చేస్తాను. నేను కేవలం దాయి నేకాను రాజ పుత్రినికూడా, నా బొందిలో ప్రాణమున్నంతవరకు విక్రముని బంధించనీయను.

కర్మ ; (ప్రవేశించి పన్నా చేతిలోని కైజారును అందుకోగా పన్నా కొంచందూరంగా వెళ్లి నిలబడును) శాంతించు పన్నా ! ప్రభువులయెడ నీకెలాంటి బాంధవ్యమున్నదో మాకూ అలాగే కాని యిది ఎవ్వరి వ్యక్తిగత అభి ప్రాయం కాదు, నిరంకుశమంతకంటె కాదు. ఇది ప్రజాభిప్రాయం, పరమేశ్వరుని ఆదేశం, మనం స్వార్థాన్ని వదులుకోవాలి ... బంధించండి.

విక్ర : (ఆశ్చర్యంగా) కర్మచంద్ ! ...

కర్మ : ఔను ప్రభూ !

విక్ర : (చేతులందిస్తూ) సరే.

(విక్రమునిబంధించి సైనికులు తీసుకొని వెళ్లుచుందురు)

పన్నా: (వెంబడిస్తూ) ప్రభూ !

ఉద : (పన్నాని వెంబడిస్తూ) దాయమ్మా !

పన్నా: (దుఃఖంతో) ప్రభూ !

ఉద : దాయమ్మా !

పన్నా: (అమితదుఃఖంతో) ప్రభూ ! (నిష్క్రమించును)

ఉద : దాయమ్మా ! (దుఃఖిస్తూ వెళ్లుచుండును)

కర్మ : (వెళ్లుతున్న ఉదయుణ్ణి పట్టుకొని) ఉదయ్! యిలారా! నేటినుండి మేవాడరాజ్యానికి నీవే అధిపతివి. నీవు పట్టాభిషిక్తుడవయ్యేవరకు వనవీరుడు పరిపాలనా బాధ్యత స్వీకరిస్తాడు. విచారించవద్దు? రానాయనా! (కిరీటాన్ని పట్టుకొని ఉదయుణ్ణి వెంటనిడుకొని నిష్క్రమించును)

తెర



# పన్నా

## ద్వితీయాంకము

(చక్కగా అలంకరించిన శీతల్ సేని మందిరం. ముఖ్మల్ వస్త్రం పరచిన బల్లపై ఒక బంగారపు పన్నా పాత్రలో రాజకిరీటము ఖడ్గము కనపడుచుండును, నేపథ్య పళ్లెరమందు నానావిధ ఫలపుష్ప గుచ్ఛములు వుంచబడి యుండును. రెండుమూలలందు నిలువెత్తు నగిషీ బల్లలపై పడగవిప్పిన రెండు తాచుపాముల బొమ్మలు అలంకరించి వుండును.)

శీత : (పట్టరానికోపంతో ప్రవేశిస్తూ) కారాగార శిక్షతో కడుపుమంట చల్లారదు. సంగ్రామసింహుని వంశాన్ని సర్వనాశనం చెయ్యాలి. మేవాడ సర్వస్వం వనవీరుని హస్తగతమై పోవాలి. నానిర్ణయానికడ్డుతగిలే ఎలాంటి శక్తినైనా ఎదుర్కొంటాను. నా ప్రతిజ్ఞ నెరవేరే వరకు నేను మృత్యుదేవతనే ఆ తరువాతనే రాజమాతను.

రంజి : (ప్రవేశించి) వందే మహారాణి !

శీత : రంజిత్ !

రంజి : మహారాణి !

శీత : నీ భవిష్యత్తు ఆలోచించావా?

రంజి ; రాణీవాసం చల్లగావుంటే నాభవిష్యత్తు బంగారంలా గుంటుంది మహారాణీ!

శీత : దానికోరకు నీవెంతైన ప్రయత్నించాలి సుమా!

రంజి : నా ప్రయత్నంలో మాత్రం యెలాంటి లోపముంది? మహారాణా దర్బారుకు వేళయిందంటే విలాస మంది రానికి నడిపించాను.

శీత : అహ్హా హ్హా హ్హా!!!

రంజి : ఆకలితో అల్లాడిపోతున్నామని మొరపెట్టుకోనుటకు వస్తే ప్రభువులకు పానీయాన్ని అందించి అమాయక ప్రజలపై కత్తిదూయించాను. నేటిప్రభువులు కారా గార శిక్షకు కారకులెవరని...

శీత : అహ్హా హ్హా హ్హా!!! ఔను రంజిత్! నీప్రభు భక్తే రాణా విక్రమసింహునికిముక్తిమార్గాన్ని చేకూర్చింది మాకూ సునాయాసంగా...

రంజి : రాజమార్గం లభించింది.

శీత : కాని......

రంజి : ఇంక సందేహించకండి.

శీత : నీవు ప్రధానామాత్యుని పదివి స్వీకరించినకదా?

రంజి : అంతటి పదవి మాకుసాధ్యమగునా మహారాణి!

శీత ; మనం ప్రయత్నిస్తే ఆసాధ్యమేలేదు రంజిత్! వన వీరుడు మహారాణా, రంజిత్ సింహుడు ప్రధానామా త్యపదవులు స్వీకరించేవరకు నాకు విశ్రాంతిలేదు,

రంజి : సంతోషం మహారాణి!

శీత : కాని నా లక్ష్యసిద్ధికి నిర్భేద్యమైన అవరోధాలెన్నో నా మార్గాన్ని నిరోధిస్తున్నవి.

రంజి : ఛేదించుటకు నేనున్నానుగా మహారాణి!

శీత : విక్రముడంటే వనవీరునకు యెంత వాత్సల్యమో నీవు గ్రహించావుగా!

రంజి : ఔను! రక్త సంబంధమైన బాంధవ్యముకదా!

శీత : వనవీరుని ప్రభుత్వాధిపత్యంలో, సంపత్ సింహుని ప్రధాన మంత్రిత్వంలో మేవాడ ప్రజానీకం, సుఖ జీవనం గడపాలని నాకోర్కె.

రంజి : అందులకు నేను సర్వవిధాల సహాకరిస్తాను–మహారాణి!

శీత : మరి ... నా కోర్కెలకు అడ్డుతగిలితే యీ రక్తసంబంధాలు, దుష్టబాంధవ్యాలు?

రంజి : అంత మొందించాలి.

శీత : అందుకు తగిన సమర్థులు?

రంజి : నేనసమర్థుడనా! మహారాణి!

శీత : రణరంగంలో నీవు రక్తంచూచి బెదరి పోతావని, ఖడ్గాన్ని చేబట్టి శత్రువును సంహరించటానికి సందేహిస్తావని, నీయంత దుర్బలుడు రాజస్థాన్ రసపుత్రుల్లో నెవ్వరు లేరని చెప్తూవుంటారే ...

రంజి : నా శౌర్యసాహసాలకు అసూయ చెందువారెవ్వరో మీతో అట్లు విలపించియుంటారు. రాజపుత్రులకు యీ రోగం పుట్టుకలోనే పుట్టుకొంటుందిగదా మహారాణి!

శీత : నీవు పౌరుషహీనుడవనే విక్రమసింహుడు తన విలాసాలకు మాత్రమే నిన్ను వినియోగించు కుంటున్నాడని కూడా నేనువిన్నాను.

రంజి : అందుకనే అంతగతిపట్టింది. రంజిత్ సమర్థుడో అసమర్థుడో కొన్నాళ్ళకు స్వయంగా మీరే గ్రహిస్తారు.

శీత : మరి...కర్తవ్యాన్ని సాధిస్తావా ?

రంజి : నిర్భయంగా

శీత : హృదయాన్ని కాఠిన్యపరచుకోవాలి.

రంజి : సిద్ధంగా వున్నాను మహారాణి !

శీత : ఆ ఖడ్గాన్ని యిలా అందించు.

రంజి : (ఒరలోనున్న ఖడ్గాన్నితీసి అందిస్తూ) ఇదిగో మహారాణీ !

శీత : వాడిగా వున్నదోలేదో చూడు.

రంజి : వాడిగానే వున్నది.

శీత : ఆ ప్రక్కనే పొంచివుండు.

రంజి : చిత్తం మహారాణీ !

శీత : నే వెళ్లుతున్నాను. క్షణంలో వనవీరుడు యిచ్చటకే వస్తాడు. మరుక్షణంలో యీ ఖడ్గంతో అతడి శిరస్సు తెగి క్రిందపడిపోవాలి.

రంజి ; (ఖడ్గం క్రిందబడవైచి) నీవు మహామారివా ? మహారాణివా ? కన్నబిడ్డ రక్తంతో కడుపునింపుకుంటావా!

శీత : నీవు అసమర్థుడవని కొన్ని క్షణాల్లోనే గ్రహించాను.

రంజి : ఈ అమానుషత్వానికి నా చేతులంగీకరించవు.

శీత : అహ్హా హ్హా హ్హా! శాంతించు రంజిత్! నా బిడ్డ రక్తం తోనే కన్నకడుపు రగుల్చుకుంటానా! ఇదంతా ఎవరికోసం! వనవీరుడు శాశ్వతంగా అంతఃపురంలోనే వుండిపోవాలనికదూ! వనవీరుని రాచరికమే మే నాడకు చిరస్థాయిగా వుండిపోవాలనిగదూ! ఆ ప్రయత్నంలోనే మరణిస్తాను... జీవిస్తాను. యిలా దగ్గరకురా రంజిత్! (రహస్యంగా) యిది కేవలం నటనమాత్రమే యుక్తిగా ప్రవర్తించాలి.

రంజి : అర్థమైంది. యింక నిర్భయంగా చేస్తాను మహారాణి!

శీత : ఇంక నీ ప్రయత్నంలో నిమగ్నుడవై యుండుము. (యిద్దరు చెరియొక ప్రక్కకు నిష్క్రమించి పొంచియుందురు.)

వన : [ప్రవేశించి అచ్చటవున్న కిరీటాన్ని అరచేతిలో నుంచుకొని]

ఓహో! రత్నఖచిత రాజకిరీటమా! నీ ప్రకాశం, నీ ప్రభావం వర్ణనాతీతం, నీ తేజస్సు నాశించిన రెండు గోళాలు ఢీకొని శూన్యంలో కలసిపోతున్నవి. నీ మెరుపుకాంతుల్లో క్రమ్మిన రెండు దేశాలు శిథిలమై పోతున్నవి. నిన్ను శిరోరత్నమని భ్రమించిన రాజులు, రాజ్యాలు మంటిలో కలిసిపోయాయి. నీ ఆదేశాన్ని పాటించిన కోటానుకోట్ల మానవులు నెత్తుటేళ్ళలో కొట్టుకుపోయారు. అలాంటి భీకరం నాలు, ప్రళయాలు, ప్రమాదాలు తెచ్చిపెట్టిన [illegible]

నా శిరస్సు నలంకరించావు. యిది కేవలం అలం కారం కోసమనుకుంటుంది అమాయిక ప్రపంచం. నేటినుండి నా శిరస్సుపై కూర్చుని కళ్లెంబిగిస్తావు యే శిఖరంపై కెక్కించి, యే సముద్రంలోదూకిస్తావో! నీ ఆదేశం యెలావుంటుందో అర్థంకావటంలేదు, అంతా అయోమయంగా వున్నది.

[రంజిత్ తన నిజస్వరూపం కనుపించకుండ నల్లని ముసుగుకప్పుకొని చేతిలో చురకత్తి నుంచుకొని వన వీరుసకు వెనుకనుండి వచ్చి అచ్చటవున్న ఖడ్గాన్ని హస్తపరచి పిడుగుపాటున మీదపడి కంఠధ్వనిమార్చి]

రం : సోదరుని బంధించి సింహాసనంపై కూర్చుని కులుకుదా మనుకున్నావా! చావు! మూర్ఖుడా! (చురకత్తితో పొడవబోతున్నట్లు హాట్టహాసం చేయును)

వన : అమ్మా! ......అమ్మా! ...... హంతకుడు ... ఖడ్గం...ఖడ్గాన్ని అందించు అమ్మా! (యింతలో రంజిత్ పారిపోవును)

శీత : (లోపలినుండి పరుగెత్తుకొనివస్తూ) వనవీర్... వనవీర్ ఎవడా హంతకుడు !

వన : ఎవడో తల్లీ గుర్తుపట్టలేకపోయాను. (పెనుగులాటలో క్రిందపడిపోయిన కిరీటాన్ని అందుకొని) మేవాడ శిరోభూషణం ధూళిధూసరితమైంది. మేవాడ చరిత్రకే కళంకము.

శీత : ఈ హత్యాప్రయత్నంలో ఏదో రాజకీయముందనుకుంటాను.

వన : ఏమోతల్లీ! నాకంతా అయోమయంగావుంది.

రంజి : [మరల ప్రవేశించి] వందే ప్రభూ !

శీత : రంజిత్! యీ సమీపంలో నీకు సర్దారులుగాని సైనికోద్యోగులుగాని యెదురైనారా ?

రంజి : ఎవరో అతివేగంగా పరుగిడుతూ సింహద్వారంవద్ద యెదురైనారు.

శీత : గుర్తుపట్టావా ?

రంజి : నేనంతగా గుర్తుపట్టలేదు. యేదో రహస్యమైన రాచ కార్యమని తలంచాను. రాజవీధి మొగసాలలో అశ్వ మొకటి సిద్ధంగావున్నది.

శీత : కుమారా ! చూస్తున్నావా యీ వైపరీత్యం !

రంజి : అంతఃపుర రహస్యాలు వింటుంటే అతిభయంకరంగా వుంటున్నై మహారాణి !

వన : అంతఃపుర రహస్యాలా !

రంజి : ఔను ప్రభూ !

వన : నాకేమీ అర్థమగుటలేదు.

రంజి : విక్రమసింహుడు సర్దారులను కూడగట్టుకొని రహస్య మంతనాలు చేస్తున్నాడు ప్రభూ !

వన : ఖైదులోవున్న విక్రముడా ! రహస్యమంతనాలా !

శీత : ఆ మంతనాలే వనవీరు ప్రాణాన్ని బలిగోరుతున్నవి.

వన : ఆలోచించకుండా అపనిందలు వేయకమ్మా !

రంజి : నేను స్వయంగా విన్నాను ప్రభూ !

వన : ఏమని !

రంజి : విక్రమసింహుడు తన అభియోగాలను అంగీకరించి క్షమాభిక్ష వేడుకుంటే మరల ప్రభువుగా అంగీకరిస్తారట !

వన : ఎవరు ?

రంజి : అమాత్యులు.

శీత : మేవాడ రాజ్యానికి సర్వాధికారియైన ప్రభువున్నా డనేమాట మరచినాడా కర్మచందు.

రంజి : పేరుకుమాత్రమే ప్రభువులట ! అధికారములన్నీ అమాత్యుల చేతట.

వన : ఆ వృద్ధజంబుకానికంత సాహసమా !

శీత : మేవాడ మహారాణాలు తన చేతి కీలుబొమ్మలని తలంచాడా ?

రంజి : వనవీర్ ప్రభువులు మహారాణా బిరుదుకు అనర్హులట.

వన : కారణం ?

[చెప్పుటకు సందేహించి శీతల్ సేని వంక చూడగా సంజ్ఞ చేయును.]

రంజి : తండ్రిగారు రాణావంశీయులైనా ... తల్లి ... (సందేహించి) క్షమించండి ప్రభూ ! యిక చెప్పే ధైర్యం నాకు లేదు.

వన : భయపడవద్దు చెప్పు రంజిత్ !

రంజి : (శీతల్ సేనివంక చూడగా చెప్పుమని సంజ్ఞ చేయును.) తల్లి రాజపుత్ర వంశానికే కళంకమట

శీత : హా !

రంజి : దుర్మార్గులు అనరానిమాటలన్నీ అనేశారు.

శీత : ఈ అవమానాన్ని భరించేకంటే అగ్నిలోదూకి ఆహుతైపోతాను. (వెళ్ళబోవును)

వన : అమ్మా! శాంతించు అమ్మా! యీ మోసమంతా యిప్పుడిప్పుడే గ్రహిస్తున్నాను! రంజిత్!

రంజి : ప్రభూ!

వన : త్వరగా వెళ్ళి కారాగృహాన్ని కట్టుదిట్టంచెయ్యి. అంతఃపుర పరివారాన్నంతా అచ్చటనే బంధించు. త్వరగా వెళ్ళు.

రంజి : చిత్తం ప్రభూ! (వెళ్ళును)

వన : నిన్నటిరోజు నాకు బలవంతంగా రాజ్యం కట్టబెట్టిన యీసర్దార్లు, యీ మంత్రులు యీనాడు రాజప్రాకారంలో విషవృక్షాలుగా మొలకలెత్తారు.

శీత : రేపు నిన్ను పదవీభ్రష్టుణ్ణిచేస్తే మేవాడ రాజ్యంలో తలెత్తుకు తిరగ్గలమా! నా బిడ్డకుజరిగే అవమానాన్ని నేను భరించలేను. (దుఃఖం నటించును.)

వన : అమ్మా!

శీత : కన్నతల్లిని ఆత్మహత్యకు ప్రోత్సహిస్తావా వనవీర్!

వన : అంతమాట అనవద్దు తల్లీ! నా మాతృదేవిఆజ్ఞ శిరసావహిస్తాను. నా ఆచరికానికి అడ్డుతగిలే యీ సర్దార్లనూ, మంత్రులను తుదముట్టిస్తాను.

శీత : పదవులకోసం ఆశించే సర్దార్లను, మంత్రులను వధించినంత మాత్రమున రాజపథంలో ముళ్ళతీగెలు నిశ్శేష

మని తలంచాను కాబోలు. యెంత అమాయకుడవు వనవీర్! ఈ హత్యా ప్రయత్నానికి నాయకులెవరో గ్రహించావా?

వన : ఎవడో చెప్పుతల్లీ! వాడి శిరస్సు నరికి నీ పాదాల కర్పిస్తాను.

శీత : ప్రతిజ్ఞ చెయ్యి! శూరశిఖామణి సితంగ్రడి పృథ్వీరాజు నీకు సమర్పించిన వీరఖడ్గాన్ని గుప్పిటబిగించి ప్రతిజ్ఞ చెయ్యి. ఈపవిత్ర మేవాడ రాజకిరీటంపై నీ హస్త ముంచి శపథంచెయ్యి. మాతృ దేవి ఆజ్ఞ విధిగా నిర్వహిస్తాను.

వన : (కిరీటంపై చేయివుంచి) నా మాతృ దేవి ఆజ్ఞ విధిగా నిర్వహిస్తాను.

శీత : నా శత్రువును అంత మొందిస్తాను.

వన : (ఖడ్గాన్ని గుప్పిటబిగించి) నా శత్రువును అంత మొందిస్తాను ఎవడో చెప్పుతల్లీ !

శీత : కుమారా ! యీ క్షణంలో నీ అదృష్టంపండి కన్న తల్లి కాపాడుకున్నది. రేపు నీవు జీవించాలంటే ...

వన : నేడే నా విరోధి రక్తాన్ని చిందిస్తాను. ఎవడో చెప్పు తల్లీ !

శీత : కారాగృహంనుండే నీపై కత్తివిసరిన కసాయి...

వన : విక్రముడా !

శీత : అవును. వాడి శిరస్సే నరికి నా పాదాలకర్పించాలి.

వన : అమ్మా !...

శీత : వాడి రక్తంతోనే నా పాదాలు తడపాలి.

వన : విక్రముడు నా ప్రియసోదరుడు.

శీత : కాదు. హంతకుడు.

వన : నీ చేతిలో పెంచి పెద్దవాణ్ణిచేశావు. మాతృహృదయం యీ రక్తపాతాన్ని అంగీకరిస్తుందా తల్లీ.

శీత : మాతృహృదయాన్ని మంటగలిపాడు.

వన : తనపైనున్న అభియోగాలకు చీకటికూపంలో అన్ని బాధలు అనుభవిస్తూనే వున్నాడుగా, సోదరుని చంపి రాచరికం నిలబెట్టుకోవటం నా కిష్టంలేదమ్మా !

శీత : వనవీర్ !

వన : అది మేవాడ సింహాసనమేగాదు ఇంద్రాసనమైనా నే నంగీకరించను. చరిత్రనన్ను దుర్మార్గునిగా చిత్రిస్తుంది.

శీత : చరిత్రనిన్ను దుర్మార్గునిగా చిత్రిస్తుందా?

వన : ఔను తల్లీ!

శీత : సర్వభోగభాగ్యాలతో తులతూగుతున్న పాండవులకు నిలువనీడ లేకుండ అడవులపాల్జేసిన కౌరవులు సోదరులుకారా? నిండుసభలో మాతృ సమానురాలైన పాంచాలి పమిటలాగి పరాభవించిన కిరాతకులు సోదరులు కారా? న్యాయంకోసం, ధర్మంకోసం భగవంతుని సమక్షంలో కురుక్షేత్రమంతా రక్తమయమైంది సోదరులమధ్యకాదా! నేను న్యాయంగాను, ధర్మంగాను అడిగాను మనకు చెందవలసిన రాజలాంఛనాలు. నేను యీబిచ్చపుకూడు తినుటకంటే రక్తపుకూడే తింటాను.

వన : అమ్మా !

శీత : విక్రముడు నీకు ప్రియసోదరుడైతే, నాకు ముద్దుల కుమారుడు. ఆ కుమారుడే తన విలాసమందిరంలో, కులట, వేశ్య యని నిందించాడు. ఆ ముద్దుబిడ్డే నన్ను చండాలి, దాసీ యని దూషించాడు.

వన : ఇంక నే వినలేనమ్మా !

శీత : నేటి మేవాడప్రభువు కులటపుత్రుడు. మేవాడ రాజమాత దాసీ విధవ...

వన : ఇంక చాలించు అమ్మా !

శీత : ఇంతకంటె నీకు చరిత్రలేదు. నీవు చరిత్రహీనుడవు వనవీర్ !

వన : అమ్మా !

శీత : ఇంక నీ ముఖం చూడలేను. ఆత్మహత్యే రాజపుత్ర వంశానికి ఆత్మగౌరవం (కైజారుతీసి పొడుచుకొనన టించును)

వన : (అడ్డువచ్చి) ఆగుతల్లీ ! నీకు జరిగిన పరాభవాన్ని నేను భరించిలేను. నిన్ను దూషించిన దురాత్ముని రక్తంతో భూదేవిని తడిపేవరకు నేను నిద్రించను.

శీత : సింహానికిమించిన శక్తిసామర్థ్యాలు మరెవ్వరికీలేవు. శత్రుగుండెపై నిలబడి గర్జించు. వెళ్లు......అరుణోదయం కాకముందే నీ భాగ్యోదయమవ్వాలి. అరుణ కాంతులతో మిలమిలమెఱసే నీ ఖడ్గం నాకు మొదట దర్శనమివ్వాలి. త్వరగావెళ్లు.

వన : వెళ్తాను తల్లీ ! ఒక్కసారి బాహ్యప్రపంచాన్ని చూడాలి చీకటి తెరలచాటున నేనూ, నా ఖడ్గం గమ్యస్థానం చేరగలమో లేదో చూస్తాను.

శీత : అంధకారం, యెటుచూచినా గాఢాంధకారం, యీ నడిరేయి, మానవజగత్తునంతా శోకొట్టి నిద్ర పుచ్చింది.

వన : ఈ నిశీథిలో కన్నకుమారుని చేతికి ఖడ్గాన్ని అందించి శత్రుభవనానికి త్రోవ చూపిస్తున్నావా అమ్మా !

శీత : మదపుటేనుగును మాటులో పెట్టి మంటగలిపే సమయ మిదే !

వన : ఈ భయంకర మారణహోమంలో అనంతకోటి మానవ రుధిరాన్ని తన శరీరంపై చిలకరించుకుంటూ భూనభోంతరములు దద్దరిల్లునట్లు ప్రళయతాండవం చేస్తున్న శక్తిస్వరూపిణి, యీ మేవాడ సింహాసనం. అహ్హాహ్హాహ్హా !!! యీ సింహాసనంపై నేను నిర్భయంగా, నిశ్చింతగా, నిర్విచారంగా కూర్చోవాలి... ఆఖడ్గాన్నిలా అందించి నన్ను ఆశీర్వదించు తల్లీ! (తల్లి పాదముల దగ్గర కూర్చుండును)

శీత : కుమారా ! శత్రుసంహారణకు కంకణము కట్టుకొని ప్రతిజ్ఞ చెయ్యి ! మేవాడ రాజ్యలక్ష్మి నిన్ను ఆశీర్వదిస్తుంది !

తెర

# పన్నా

## తృతీయాంకము

స్థలం : కారాగృహం … … సమయం … … రాత్రి … …

[కారాగృహంలో విక్రముడు సంకెళ్ళతో బంధించబడి మతిభ్రమతో తిరుగుచుండును. పరుండుటకు కటిక రాతిపై యెండుగడ్డి పరచియుండును. ఒకమూల మట్టి కుండ, దానిపై మట్టిపాత్ర కనబడుతుండును. కారాగృహానికి ఒకద్వారం, ముందు ఖాళీస్థలంలో సైనికుడు పహరా తిరుగుతూవుండును. దూరాన్నుంచి ఘడియల ధ్వని వినిపించును. కారాగృహ లోపలిభాగమంతా కటకటాలమధ్యనుండి బయటకుకనుపించును.]

విక్ర : (పడకపైనుండి లేచి కటకటాల దగ్గరకువచ్చి) ఎవరక్కడ ! సిపాయీ ! సిపాయీ ! … ఎవ్వరూ కనుపించరు … నిన్నటివరకు నాముందు చేతులు కట్టుకొని సావధానులైన సిపాయిలు నేడు కత్తిచూపించి భయపెడుతున్నారు. అయితే నేను మహారాణాను కానా ? ఏదీ నా సింహాసనం ! … (నలుమూలలూ తిరుగుతూ) ఏదీ … … ఏదీ … … … (గడ్డిపరచిన పాన్పుచూచి) అహ్హా హ్హా హ్హా హ్హా హ్హా !!!!! ఇదిగో నాసింహాసనం … యిదేనాఅగ్రాసనం … … పూలువిరజిమ్మిన ప్రణయపాన్పు, రత్నాలకాంతిలో రంజిలు రంగురంగుల పట్టుపాన్పు … ఊహుఁ … కాదు … … యిది మృత్యుకన్య

కౌగిలిలో మురిసిపోతూ కన్నుమూసే ముళ్ళపాన్పు. ఈ గడ్డిపరకలే మేవాడ మహారాణాకు తగిన ఆహారం. నిరుపేద ప్రజానీకాన్ని ఆకలిమంటలకు ఆహుతిగావించిన ప్రభువుకు జంతుజాలములు భుజించే ఆహారమే లభిస్తుంది. అహ్హా హ్హా హ్హా హ్హా!!!! భగవాన్ ఏకలింగేశ్వరుడు నాకు తగినశిక్ష విధించాడు ...(సంకెళ్లు చూచుకొని) నేను మహారాణాను కాను మహాపరాధిని ... ...యీ అంధకారంలో వుండి వెలుగును చూస్తాను, యీ అంధకారంలో వుండి వైరాగ్యాన్ని పొందుతాను, యీ అంధకారంలోవుండి కవిత్వాన్ని గానంచేస్తాను.

పగలు వెనుక రేయేల
పాపముతో పుణ్యమేల
ప్రభువులలో పశువులేల
నీచులలో నీతియేల
నాచు నడుమ కమలమేల
గులాబీకి ముళ్లేల
మంచి వెనుక చెడుగేల
మంచుతో మంటలేల ..
సుఖం వెనుక దుఃఖమేల
సిరులుండీ చెరయేల
చీకటిలో వెలుగులేల
వెలుగుండీ చీకటేల ...

అహ్హా హ్హా హ్హా హ్హా !!!! ఓహో ! ఏమి కవిత్వం ! అభ్యుదయ కవిత్వం, ఆశుకవిత్వం!... ఎంత హాయిగా పాడాను అహ్హా హ్హా హ్హా హ్హా !!!! మధువు త్రాగితే యింకా మధురంగా పాడతానేమో!... ఏదీ నామధుపాత్ర... యిదిగో నా మధు పా... కాదు మృణ్మయపాత్ర... (మట్టిపాత్ర అందుకొని) ఛీ ! ... యిందులో నీళ్లుకూడా నిండుకున్నవి (మట్టిపాత్ర నేలపై కొట్టును) అహ్హా హ్హా హ్హా హ్హా !!!! (నేపథ్యంనుండి నవ్వులు ప్రతిధ్వనించును) ఆ... ఎవరానీచులు (సిపాయి పహరా తిరుగుతూ కనుపించును) ఏయ్! సిపాయీ ! కొంచం మధువందించు... చూడు... దాంట్లో కొంచం కాలకూటాన్ని కలుపుకురా ! వీళ్లందర్ని సర్వనాశనం చేస్తాను... వద్దు... వద్దు సిపాయీ నేనే సంతోషంగా మరణిస్తాను... విషాన్ని కలపవ్వా! ఓహో ! అది వీరమరణం కాదంటావా ? వీరమరణాన్ని కోరుకుంటే కారాగృహమంతా కదనభూమిగా మారిపోతుంది. అది నాకంత యిష్టంలేదు సిపాయీ... ...నా కిష్టం లేదు....

[చేతిలో పళ్లెము, పళ్లెములో తాను ధరించినలాంటి చీర, రవికె నుంచి, కనుపించకుండ పైన ఫలహారములు పేర్చి నల్లని ముసుగు కప్పుకొని మెల్లగా పనా్న ప్రవేశించును]

: ఎవరది ?

పన్నా: దాయిని ప్రభూ !
విక్ర : దాయమ్మా !
పన్నా: ప్రభూ !
విక్ర : ఒంటరిగా యెందుకిలా వచ్చావు ?
పన్నా: మీ వుప్పు పులుసు తిన్న ఋణం తీర్చుకుందామని.
విక్ర : అద్యేం తల్లీ !
పన్నా. ముందు యీ ఫలహారం స్వీకరించండి.
విక్ర : నాకు ఆకలిలేదు ఆశలంతకంటె లేవు.
పన్నా: నా ప్రార్థన ఆలకిస్తారా ప్రభూ!
విక్ర : ఏమిటమ్మా !
పన్నా: ఈ దుస్తులు ధరించి కారాగృహాన్నుండి విముక్తి పొందండి ప్రభూ !
విక్ర : అదెట్లు సంభవం తల్లీ !
పన్నా: ఈ ముద్రికను సింహద్వారం వద్ద చూపించండి మిమ్మల్ని యెవ్వరూ అడ్డుపెట్టరు.
విక్ర : కారాగృహాన్నుండి పారిపోవలసిన అగత్యమేమున్నది?
పన్నా: మేవాడ భవిష్యత్తుకోసం. జీవితాంతం కారాగృహంలోవుండి మీరుసాధించేదేమీ లేదు. త్వరగా విముక్తి పొందండి ప్రభూ !
విక్ర : నేను అపరాధిని, పరమేశ్వరుడు నాకు శిక్ష విధించాడు, అనుభవిస్తున్నాను ... కాని...రాణా సంగ్రామసింహుని వంశరక్తం నానరాల్లో ప్రవహిస్తూనే వుందమ్మా !
పన్నా: క్రోధభరితమైన స్త్రీహృదయానికీ, విషపూరితమైన కాలసర్పానికీ హద్దులు కనుపించవు ప్రభూ !

విక్ర : భయపడను, పురుషునిగా జన్మించాను. చీరకట్టుకొని క్షేమలోనుండి పారిపోవుట ఉత్తమ క్షత్రియలక్షణం కాదు.

పన్నా: క్షమించండి ప్రభూ !

విక్ర : ఈ అంధకారంలో నాకు శాంతి, సుఖమున్నది స్వర్గానికి దేవతలాహ్వానించినా నా విధికికట్టుబడి వుంటాను.

పన్నా: సంగ్రామసింహుని కాంతిరేఖలు నేటివరకూ మేవాడ రాజ్యంలో ప్రకాశిస్తూనేవున్నవి ప్రభూ! మహారాణా వంశంపై ప్రేమానురాగాలు మేవాడ ప్రజల్లోను, రసపుత్ర సైనికుల్లోనూ నశించలేదు. మీరుచేసిన కొద్ది పొరపాట్లకు యీ కఠినశిక్ష ఆజన్మాంతరము అనుభవించవలసిందేనా ప్రభూ !

విక్ర : చేసినతప్పు కొద్దిదైనా పెద్దదైనా శిక్షమాత్రం అనుభవించవలసిందే దాయమ్మా !

పన్నా: ఉదయసింహుని భవిష్యత్తు ఆలోచించారా ప్రభూ !

విక్ర : ఉదయునకు నేటినుండి నీవే తల్లివి, తండ్రివి, సోదరుడవు... మేవాడ రాజ్యలక్ష్మి ఉదయుని భవిష్యత్తు తీర్చి దిద్దుతుంది. నీవు విచారించవద్దుతల్లీ!

పన్నా: మీరులేని ఈ రాజ్యప్రాంగణంలోని విషవాయువును నేను పీల్చలేను. సంగ్రామసింహుని వంశవిచ్ఛిత్తి నేను చూడలేను. మేవాడ సింహాసనం రాక్షస పరిపాలనకు పీఠమయింది. నేటినుండి దుష్టశక్తులు విజృం

భిస్తవి. వాటిని రికట్టాలి. నా మాటవిని మీరు వెళ్ళండి ప్రభూ! మీ నుండి చెదిరిపోయిన కీర్తి ప్రతిష్టలు తిరిగి పొందండి—త్వరగా వెళ్ళండి ప్రభూ!

విక్ర : ఖైదీగావుండి పారుబోతుగా ప్రవర్తించుట పాపాన్ని పెంచుకోటమే తల్లీ! ఈ అంధకారంలో నే చేసిన పాపాలనుండి ముందు విముక్తి పొందాలి, అతరువాతనే కారాగారవిముక్తి.

పన్నా: పాపాలు మీరు చేసినవికాదు ప్రభూ! మీతో పాపాలు చేయించినవారే మిమ్ము్మలను బంధించారు.

విక్ర : ఈశరీరం మైలపడింది, నన్ను తాకిన మేవాడ సింహాసనం. మేవాడ రాజమకుటం మైలపడినవి. యింక మేవాడ రాజ్యమంతా వ్యాపించకూడదు. మేవాడ రాజ్యాన్ని అనేకమంది రాణాలు పరిపాలించారు. అనేకమంది రాణాలు పరిపాలింపనున్నారు. రాణా వంశం వృక్షచ్ఛాయల్లో మేవాడ ప్రజానీకం సుఖనిద్రపొందారు. నేడు రాణా వంశవృక్షంలో ఒక కొమ్మకు చీడబట్టింది. పరమేశ్వరుడు ప్రమాదాన్ని గ్రహించి వేరుపరచాడు.

పన్నా: పాపాలకు పశ్చాత్తాపము చాలదా ప్రభూ!

విక్ర : అది సామాన్యమానవులకు. ప్రజలభారం రాజు వహిస్తాడు. రాజు తప్పుచేస్తే ప్రజలు నశిస్తారు.

పన్నా: మీ వైరాగ్యం దుష్టశక్తుల్ని అరికట్టుతుందా ప్రభూ!

విక్ర : దుష్టశక్తులు తాత్కాలికంగానే విజృంభిస్తవి. నా కొరకు విచారించవద్దు తల్లీ!

పన్నా: నా ఆశల్ని దూరంచేసుకొని: నిస్పృహతో వెళ్లిపో వలసిందేనా ప్రభూ!

విక్ర : నన్ను యింకా ప్రభూ... అంటున్నావా దాయమ్మా! యీ సమయంలో నేను ఖైదీని షహరావాళ్లు వచ్చే వేళయింది.

పన్నా: వెళ్లుతున్నాను ప్రభూ! (ఆవేదనతో అడుగులువేసు కుంటూ నిష్క్రమించును)

విక్ర : పన్నా!... దాయమ్మా! (బిగ్గరగాపిలచి కటకటా లపై తలవాల్చి దుఃఖిస్తూవుండును)

(నేపథ్యంలో పాట)

ఓ మేవాడ మహారాణా! ఓ రాజవిక్రమా!
కటిక-చీకటి నీకు రవికోటితేజమా!
అంధకారమెనీకు బంధువై మిగిలెనా!
పశ్చాత్తాపము కడకు కలిగెనా?
పరితపించి విలపించెద వేలా ॥పశ్చా॥
పశ్చాత్తాపము పాపముబాపద
శిక్షను తప్పక అనుభవింతువని
మారువేసముగ పారిపొమ్మనిన
వలదని తొత్రము నిలిపిన వీరా ॥పశ్చా॥
పౌరులభాగ్యము రాజయోగ్యమని
మనసున తెలిసియు విధివిలాసమున
కరుడుగట్టిన నీ పాపమ్ములు
కరుగును నిజముగ నీ కన్నీటా ॥పశ్చా॥

విక్ర : (ఆవేదనతో క్రుంగిపోతూ వెళ్ళి పడకపై పడుండును)
[కాగడా పట్టుకొని ముందు ఉదయసింహుడు వెనుక కర్మచందు ప్రవేశింతురు]

ఉద : ప్రభూ !... ప్రభూ !...

విక్ర : ఎవరూ !

ఉద : నేను ఉదయుణ్ణి

విక్ర : (ఆశ్చర్యంగా) ఉదయ్ !...

ఉద : ప్రధానమంత్రి కర్మచందుకూడా వచ్చారు

విక్ర : (ఆశ్చర్యంగా) కర్మచందు కూడా వచ్చారా !

ఉద : ఔను ! మిమ్మల్ని విడుదల చేస్తారట.

విక్ర : ఆజన్మకారాగార శిక్షకు విముక్తికూడా వున్నదా ఉదయ్ !

కర్మ : వున్నది... ప్రభూ !

విక్ర : కర్మచంద్ !

కర్మ : ఔను ప్రభూ !

విక్ర : నేను మహాపాపిని, హంతకుణ్ణి, గర్వాంధకారంలో ఒళ్లు తెలియక ఆ నాడు అందరిసమక్షంలో మీపై కత్తిదూసాను. జన్మభూమి సేవకై తన జీవితాన్నే అంకితంచేసిన, పితృసమానులైన మిమ్మల్ని అవమానపరచాను. మీరు నన్ను క్షమించి విడుదలచేస్తారా మహామంత్రి !

కర్మ : అయినదేదో అయిపోయింది. గతించిన విషయాలు జ్ఞప్తికి తేకండి ప్రభూ ! ఆ నాటి ప్రజావుద్రేకాన్ని

శాంతిపరచుటకట్లు చేయవలసివచ్చినది. రాణావంశం అపకీర్తిపాలగుట నామనస్సు అంగీకరించలేదు. నేటి నుండి బాధ్యతాయుతమైన ప్రజాపరిపాలనకు ప్రతిజ్ఞ చెయ్యండి. మేవాడరాజ్యలక్ష్మి మిమ్ము క్షమిస్తుంది.

విక్ర : మేవాడరాజ్యంలో ప్రతి ఒక్క పౌరునీ క్షమాభిక్ష వేడుకుంటాను. వాళ్లు క్షమించినరోజే నాకువిముక్తి.

ఈ అంధకారంలో అన్నికోర్కెలూ మరచిపోయాను. నన్ను నేనే మరచిపోయాను. కళ్లు మూసుకొని భగవంతుని చూడాలని తపస్సుచేస్తున్నాను. మరలనన్ను వెలుగులోకి లాగవద్దు మహామంత్రీ !

కర్మ : మీపౌరపాట్లు మీరుగ్రహించి ఆవేదనపడుతున్నారు. రవికులసార్వభౌముని సహజకాంతులు మీ కన్నీటి బిందువుల్లో ప్రకాశిస్తున్నవి. మీలో జ్ఞానోదయం కలిగినందుకు యీ రోజు నా కెంతో ఆనందంగా వున్నది. నా కోర్కె నంగీకరించండి ప్రభూ !

ఉద : అమాత్యులకోర్కె నంగీకరించి విముక్తి పొందండి ప్రభూ ! సిపాయీ ! ద్వారం తెరువు.

(సిపాయివచ్చి ద్వారం తెరవబోవును)

రంజి : (ప్రవేశించి) ఆగు ! (సిపాయిచేతిలోని తాళపుగుత్తిని గుంజుకొని) ఎవరిచ్చారు నీకీ అధికారం ?

(సిపాయి వెళ్ళిపోవును)

కర్మ : ప్రధానమంత్రి.

రంజి : ప్రధానమంత్రి చాలడు.

కర్మ : విక్రముని కారాగార విముక్తికి ప్రభువు లంగీక
రించారా ?

రంజి : మంత్రులు, సామంతులు, సర్దారులు, ప్రజలు నిర్ణయించి యీ శిక్ష విధించారు. వారందరి అంగీకారంతోనే యీ శిక్ష రద్దుపరచాలి. నేటినుండి ప్రభువాజ్ఞ లేనిదే యిచ్చట కెవ్వరూ ప్రవేశించే అర్హత లేదు.

విక్ర : రంజిత్ ! నీవు ప్రభుభక్తిపరాయణుడవు కదూ !

రంజి : కనుకనే ప్రభువాజ్ఞ పాటిస్తున్నాను... పొండి...

కర్మ : అధికారరీత్యా రంజిత్ చెప్పినది సమంజసముగానే యున్నది. అయినప్పటికీ మించిపోయిన దేమీ లేదు. అందరి అనుమతిపొందే ప్రభువును విడుదలచేద్దాం. ప్రభూ ! యీరాత్రికి వేచియుండండి.

ఉద : ప్రభువునిప్పుడు విడుదలచేయరా మహామంత్రీ !

కర్మ : విచారించవద్దు బాబూ ! ఈ ఒక్కరాత్రి... ... ... యుగాలు గడిచేదిలేదు. మరల ఉదయాన్నే ప్రభువును దర్శించుకుందాం ... రా బాబూ...
(ఉదయుని కళ్ళలో నీళ్ళు తిరుగును, చేతిలోని కాగడా క్రిందపడిపోవును, కర్మచందు ఉదయుణ్ణి వెంటనిడుకొని నిష్క్రమించును, రంజిత్ వేరొక ప్రక్కకు వెళ్ళి పొంచి యుండును.)

విక్ర : (వెలుగుతున్న కాగడావంక తదేకధ్యానంతో చూస్తూ కాగడాను అందుకొని), దూరోజ్జ్వలశక్తిసహితం, ప్రవేశించే

అర్హతలేని యీ అంధకారకూపంలో నీవు వెలుగును విరజిమ్ముతున్నావా! ... నీకు నేనంటే యెంతదయ, యెంత కరుణ ... నా పూర్వులు యీకారాగృహాన్ని నిర్మించారేగాని యీ రోజువరకు దీపమైనపెట్టి యెరుగరు. నా హయాములోనూ అంతేజరిగింది. మేవాడ ప్రభువు ఖైదీగావున్నప్పుడే నీవు వెలుగుట అంత న్యాయంకాదు. పైగా నా పాపాలు యీ అంధకారంలో అదృశ్యమైపోకుండ నీవు ఆటంకపరచుట నే నంగీకరించను. (కాగడాను నేలపైరుద్ది పాన్పుపై పరుండి నిద్రించును)

రంజి : (ప్రవేశించి తనదగ్గరవున్న తాళంచెవితో ద్వారం తెరచి మరలవెళ్ళి పొంచియుండును)

(నేపథ్యంలోపాట)

చిత్రము చూస్తున్నావా దేవా
చిత్రము చూస్తున్నావా
లోకమొకటి సృజియించి దానిలో
చీకటి వెలుగులు కలిపించి
పరిపూర్ణ సుఖములను పొందినవారికి
కష్టాలంటూ కలిపించి ॥చిత్రము॥
రాజులు రాజులు రాజ్యకాంక్షతో
వైరములో విధ్వంసముకాగా
ధనికులు పేదల నిర్మిస్తుంటే
దరిద్రనారాయణ రూపముతో ॥చిత్రము॥

వన : (ప్రవేశించి) ఈ నడిరేయి......యీనిశీథంలో కారు మేఘాలు పందెపు గుఱ్ఱములవలె పరుగులిడుతున్నవి. ప్రపంచమంతా చీకటిముసుగులో మేనుమరచి నిద్రిస్తున్నది. శత్రుసంహారణకు ప్రతిజ్ఞ చేసిన సుముహూర్తము సమీపించినది. మేవాడ రాజపథంలో పరుగులిడు నారథచక్రాలకడ్డుతగిలే మొట్టమొదటనృపుణ్ణి సమూలంగా నాశనం చేస్తాను. (కటకటాల గుండా చూచి) ఈ పాపాలకు భైరవుడు భోనులో బుసలు కొడుతున్నాడు. గాఢనిద్రలో ఉబ్బెత్తుగా వస్తున్న వక్షస్థలాన్ని బ్రద్దలుకొడతాను. నిద్రలోవుండే ఈ జీవుడు కారాగారవిముక్తి చెందాలి. కాదు సింహాన్ని మేల్కొలిపి వధించుటే పురుషలక్షణము (ద్వారం దగ్గరకు వెళ్లి గంభీరంగా) విక్రం !...విక్రం... !

విక్ర : (నిద్రలేచి) ఎవరిదీ కంఠస్వరం !

వన : నీపాలిట మృత్యువుది.

విక్ర : మాటలోని మాధుర్యాన్ని వినగా నా సోదరుడు వనవీరుడే కావచ్చు.

వన : సో ..ద...రు...డు అహ్హ హ్హ హ్హ హ్హ !!!!

విక్ర : ఈ రాత్రి నాకు నేత్రపర్వంగావున్నది. కళ్లు తెరిస్తే బంధుమిత్రులంతా కనబడుతున్నారు. కళ్లు మూస్తే దేవతలంతా సాక్షాత్కరిస్తున్నారు.

వన : దేవతలుకాదు నీ పాలిట యమదూతలు.

విక్ర : వనవీర్ ! నీవేనా యీ వికటాట్టహాసం ?

వన : ఆ...... నేనే......ఒక్కసారితొొంగిచూడు మృత్యు ముఖంనుండి.

విక్ర : కారాగృహంలోవున్న నీ సోదరునితో హాస్యమాడు తున్నావా ? వనవీర్ !...

వన : కారాగృహంలోవుండే నాపై హత్యాకాండకు పురి కొల్పిన నిన్ను కారాగృహంలోనే హతమారుస్తాను.

విక్ర : నీపై హత్యాప్రయత్నమా ! మతిచెడి మాట్లాడు తున్నావు !

వన : పాపాలు ప్రకోపించి నీకే మతిచెడి నాపై కుట్రపన్ను తున్నావు దుర్మార్గుడా నిన్ను చిత్రవధచేస్తాను.

విక్ర : వనవీర్ ! నీరాచరికం నిన్ను పెడమార్గంపట్టిస్తున్నది. నీ రాజకిరీటం నిన్ను కుప్పిగంతులు వేయిస్తున్నది.

వన : ఆ మిడిపిపాటుతోనే మల మల మాడిపోతున్నా గతాన్ని విస్మరించి మాట్లాడుతున్నావు.

విక్ర : నేను గతాన్ని విస్మరించలేదు, గతాన్ని తలంచి కుమిలిపోతున్నాను.

వన : కుమిలిపోవటంకాదు పూర్తిగా నశించిపోవాలి.

విక్ర : నేను పూర్తిగా నశించిన నీకీర్తి ప్రతిష్టలు ఉన్నత స్థానాన్ని అలంకరించునా !

వన : ప్రక్కలో బాకునుచూస్తూ నిద్రించలేను. సంగ్రామ సింహుని వంశం సర్వనాశనం కావలసిందే.

విక్ర : నేను నిరాయుధుణ్ణి, నా చేతులకు, కాళ్ళకు విధి సంకెళ్లు తగిలించింది. నన్ను సునాయాసంగా వధించ వచ్చు, సిద్ధంగావున్నాను వనవీర్ !

వన : సిద్ధంగావ్రున్నానంటే క్షమించేది లేదు. నీ జాలిమాట లకు నా గుండె ద్రవించదు. ఆనాడు జయసింగు నీపై కత్తిదూసినప్పుడు నా ప్రాణాన్ని అడ్డుపెట్టాను, మరచిపోయావా విశ్వాసఘాతకుడా !

విక్ర : ఆ నాడు ప్రాణత్యాగానికి ముందడుగువేసిన యువకో ద్రేకం యీనాడు భ్రాతృహత్యకు సిద్ధపడుతున్నది.

వ : మాతృదూషణకు ప్రతిఫలం...

విక్ర : అర్థమయింది. దుష్టశక్తులు నీలో ప్రవేశించి నిన్ను రెచ్చగొడుతున్నవి. ఏదో భయంకరపిశాచం నీ వెనుక నుండి విలయతాండవం చేస్తున్నది. ఏదో మహామారి నిన్నావరించి హద్దులు దాటకొడుతున్నది. నాగు జెముడు నీడలో విహరించవద్దు వనవీర్ !

వన : విలాసమందిరంలోవున్న రసికప్రభువులు తన కుమారు డని తలం వచ్చింది చండాలిగనూ, దాసివిధవగను దూషించావు. నాడు నా మాతృదేవి చేసిన ప్రతిజ్ఞ నా విధిగా నిర్వహిస్తాను.

విక్ర : సోదరా ! ఆ నాడు పినతల్లిని దూషించాను, తల్లి నే కాదు, నా విలాసాలకు అడ్డువచ్చే ప్రతిఒక్కరిపైనా కత్తిదూశాను.

వన : విక్రమకుడవు కదూ !

విక్ర : నాకు దాపురించిన దుష్టగ్రహాలఫలితంగా మీ యం దరి హృదయాలలో చేతులు జోడించాను, యీనాటి వరకూ విడిపోలేదు. నా అభిరుచులకు నాకు తగిన

శిక్ష విధించారు. అనుభవిస్తున్నాను. నేడు మేవాడ రాజమకుటం నీ శిరస్సు నలంకరించింది. మేవాడ సింహాసనం అధిష్ఠించి సర్వజనసమ్మతంగా పరిపాలిస్తున్నావు. మంత్రులు, సామంతులు, సర్దారులంతా నీ అదుపులో వున్నారు. మేవాడ రసపుత్రసైన్యమంతా నీ ఖడ్గచ్ఛాయల్లో మెలుగుతున్నది.

వన : నిస్సందేహంగా.

విక్ర : మరి... నేను బ్రతికుండియు చచ్చినవాడితో సమానం యింక నీకు భయమెందుకు వనవీర్ !

వన : నేను భగవంతునికూడా భయపడను, మాతృ ఆజ్ఞ శిరసావహించాలి, మాతృప్రతిజ్ఞ నెరవేర్చాలి. నీ అంతిమ కోర్కె విన్నవించుకో.

విక్ర : నాలో కోర్కెలు నశించినవి, ఆశలు అంతరించినవి, నా రాచరికానికి సంకెళ్లు తగిలించారు. సోదరా ! వనవీర్ ! నా కొక్క కోర్కె మాత్రమున్నది, మన్నిస్తావా, తప్పక అంగీకరిస్తావా !...

వన : ఊఁ. అంగీకరిస్తాను.

విక్ర : నన్ను యీ కారాగృహాన్నుండి విముక్తి చెయ్యి, యీ సంకెళ్లు తొలగించు. మేవాడ సామాన్యపౌరుని వలెకూడా నే నిచ్చట జీవించుటకిష్టపడను సన్యాసినై, భికారినై యీ మేవాడసరిహద్దులు దాటిపోతాను. తీర్థయాత్రలు సేవిస్తాను. ఏ కొండగుహల్లోనో కూర్చుని యీ తనువు చాలిస్తాను.

వన : విక్రం ! నిన్ను తీర్థయాత్రకే పంపుతాను. (లోనికి ప్రవేశించును)

విక్ర : నిజంగానా వనవీర్ ! ఓహో! నేనంటే నీకెంతదయ, యెంతకరుణ, యీ సంకెళ్లు తొలగించు...... నన్ను ఒక్కసారి కౌగిలించుకోనివ్వు వనవీర్ ! (చేతులు చాపుతూ ముందుకు వచ్చును)

వన : (విక్రముని కత్తితో ప్రక్కయెముకలో పొడుచును)

విక్ర : వనవీర్ ... వనవీర్ ... (క్రిందబడిపోవును)

వన : ఇంక మాట్లాడవద్దు స్వేచ్ఛగా పరలోక యాత్ర సాగించు (మరల ఖడ్గాన్ని గుండెల్లో గ్రుచ్చి) చావు మూర్ఖుడా !...

విక్ర : భ...గ...వా...న్! ఏ...క...లిం...గే...శ్వ... రా ! (చనిపోవును)

రంజి : (ప్రవేశించి తానుకూడా కత్తితో విక్రముని ఒకపోటు పొడిచి) మ...హా...రా...జా...విక్రం...పరలోక యాత్ర...(ఒకప్రక్కకు నిష్క్రమించును)

వన : అహ్హా హ్హా హ్హా హ్హా హ్హా !!!!! (వికటాట్టహాసంచేస్తూ వేరొకప్రక్కకువెళ్లుచుండగా నల్లనిముసుగు కప్పుకొని శీతల్ సేని ప్రవేశించును) ఎవరూ !

శీత : (ముసుగు తొలగించును)

వన : (ఆశ్చర్యంతో) అమ్మా ! నీవుకూడా వచ్చావా !

శీత : వచ్చాను, నీవీరవిహారాన్ని కళ్లారాచూచి ఆనందిద్దామని.

వన : నీ ప్రతిజ్ఞ నిర్విఘ్నంగా నెరవేర్చాను తల్లీ! నీ అవమాన దావాగ్ని, నా ఖడ్గదాహము ఒకేసారి చల్లార్చాను. యిదిగో తల్లీ! విక్రముని రుధిర స్రవంతిలో వసంతమాడిన వీరఖడ్గం. నీ పాదధూళితో...

శీత : అపవిత్రం చేయవద్దు. యిలా చేతికందించు.

వన : (ఖడ్గాన్ని అందిస్తూ) ఇదిగో తల్లీ !

శీత : (ఖడ్గాన్ని అందుకొని పరికించి మరల నేలపై విసరి)ఛీ!

వన : (ఆశ్చర్యంగా) అమ్మా !...

శీత : ఈరూపంలోవున్న ఖడ్గాన్ని నేను ముట్టను. పాపపంకిలమైన రక్తాన్ని పులుముకొని చూచుటకే వికృతంగా వున్నది.

వన : శుభ్రపరుస్తాను తల్లీ !

శీత : ఉదయుని రక్తంతో...

వన : హాఁ... ఉదయుని రక్తంతోనా ! నీలో భీకరాగ్ని రగుల్కొన్నదా, అమ్మా !

శీత : ఉదయుని రక్తధారతోగాని అది చల్లారదు.

వన : ఉదయుణ్ణి నీ ఓడిలో పెంచావమ్మా !

శీత : పెంచాను పులిపిల్లను పెంచినట్లు !

వన : ముక్కుపచ్చలారని పసిబిడ్డను హత్య చేయమంటున్నావా తల్లీ ! నిన్ను దాసియని నిందించిన నీచుని కళేబరమదిగో రక్తపుమడుగులో తేలిపోతున్నది. ఉదయునితో మనకేలాంటి వైరుధ్యంలేదు బాలహత్యకు నన్ను శాసించవద్దు తల్లీ !

శీత : నేటిబాలుడు రేపు వీరుడౌతాడు. నాడే మేవాడ సింహాసనానికి హక్కుదారుడు.

వన : కావచ్చు.

శీత : మరి... నీవు ?

వన : ఉదయునిపై కత్తి యెత్తలేను.

శీత : ఈ రక్తపాతంలోని ఫలితాన్ని అనుభవించే దెవరను కున్నావు ?

వన : నేను అనుభవించలేను, భగవంతుడు నన్ను క్షమించడు,

శీత : తల్లి ఆజ్ఞ తిరస్కరించి బ్రతికిపోగలవా !

వన : అమ్మా ! ......

శీత : భగవంతునికంటె అతీతమైనది మాతృ ఆజ్ఞ.

వన : ఔను తల్లీ !

శీత : నీవంత దుర్బలుడవైతే ఆ ఖడ్గాన్నిలా తే సంగ్రామ సింహుని వంశానికి మిగిలియున్న ఉదయుణ్ణి నేనే వధిస్తాను (వనవీరుని వరలోనుండి ఖడ్గాన్ని గుంజుకొన బోవును) కన్నతల్లిని ధిక్కరించిన నేరానికి నీకు నరకమే ప్రాప్తిస్తుంది. మూర్ఖుడా (దురుసుగా వెళ్లును)

వన : అమ్మా !... అమ్మా !... అమ్మా ! ... (వెంబడిస్తూ నిష్క్రమించును)

తెర

# ప న్నా

## చ తు ర్థాం క ము

ఉదయసింహుని శయనామందిరం. సమయం... రాత్రి

[ఉదయుడు పాన్పుపై పరుండి నిద్రపట్టక పొర్లుతుండును. పన్నా కాళ్ళదగ్గర కూర్చునిఉండును. చందనుడు ఉదయుని పాన్పుప్రక్కనే నేలపై నిద్రిస్తూ వుంపును. ఒకమూల జ్యోతి వెలుగుతుండును. మంచి నీటికూజా లోటా వుంచబడును.]

ఉద : దాయమ్మా! ఉదయాన్నే ప్రభువును విడుదలచేస్తారు గమా!

పన్నా: విడుదలచేస్తారు ప్రభూ!

ఉద : ఒకవేళ చేయకపోతే

పన్నా: అన్నగార్నిగురించి బెంగపెట్టుకోవద్దు నాయనా! నీవు ఆడుకుంటూ పాడుకుంటూ హాయిగా భోజనం చేసి వేళకు నిద్రించాలి లేకపోతే జబ్బుచేస్తుంది.

ఉద : నీవు రాత్రంతా నాదగ్గరే కూర్చుంటావు, ఒక్కసారి కూడా నిద్రపోవు, నీకుమాత్రం జబ్బుచేయదా దాయమ్మా!

పన్నా: మేము పెద్దవాళ్ళంకధూ మాకు జబ్బుచేయదు.

ఉద : నాకు యీరోజు నిద్దేరావటంలేదు, నామనస్సంతా అన్నయ్యమీదే వున్నది.... దాయమ్మా!

పన్నా: ప్రభూ!

ఉద : మంచిపాటేదైనా పాడమ్మా !
పన్నా: పాటపాడతాను మరి నిద్రపోతావా ?
ఉద : నేను హాయిగా నిద్రపోతాను. పాడమ్మా ! ... పాడు.
పన్నా: (జోకొట్టుతూ)

నిదురపో యిక నిదురపో
కలలులేని కలతలేని ॥నిదుర॥
జోలపాటలు వినబడితే బాలలకుహాయి.
హాయిగా నువు నిదురపోతే నాయికీహాయి
॥నిదుర॥

రాజువై రారాజువై నువు రాజ్యమేలాలి
ప్రజలు నినుగని రాముడేయని పొంగిపోవాలి
॥నిదుర॥

రాజ్యమంతా శాంతి నిలచి సిరులు తేలాలి
చరితనిన్ను తరచి తరచి చెప్పుకోవాలి ॥నిదుర॥

(ఉదయుడు నిద్రించును. మరికొంతసేపటికి పన్నా కూడా మంచానికితల ఆనించికునికిపాట్లుపడుచుండును)

(నేపథ్యంలో): పన్నా ! ......పన్నా ! ......
పన్నా: (ఉలిక్కిపడిలేచి) ఎవరూ! ... ఎవరది ! ...
బారి : (పరుగున ప్రవేశించి) సర్వనాశనం ... మేవాడ సర్వనాశనమైంది. ఉదయుణ్ణి భద్రపరచు.
పన్నా: ఏమైనదది బారీ !
బారీ : దారుణమైన హత్య !
పన్నా: ఎవరిని ?

బారి : ఖైదులోవున్న విక్రముని.

పన్నా: హా... విక్రమునా ! నా ప్రభువును హత్యచేశారా ! భగవాన్ ! నా ప్రభువుకంత దారుణమైన శిక్ష విధించావా ! సంగ్రామసింహుని వంశ మంత దిక్కుమాలినదై పోయిందా! తల్లీ! మేవాడ రాజ్యలక్ష్మీ! నీ ముద్దుబిడ్డ తప్పుచేస్తే నెత్తురు త్రాగుతావా ! బారీ! ఉదయుణ్ణి జాగ్రత్తగా చూస్తుండు. కడసారిగా నా ప్రభువును దర్శించుకొస్తాను.

బారి : వద్దు... వద్దు పన్నా ! రాజభవనమంతా కసాయి వాళ్ళకు నిలయమైపోయింది. రాజమాత నరమాంస భక్షణాకలవాపుపడింది. వనవీరుడు తోళ్ళగుంపులోని వ్యాఘ్రమువలె పరుగులిడుతున్నాడు. ఈ నడిరేయి మృత్యుదేవత రాజ్యప్రాంగణంలో పైశాచిక నృత్యం చేస్తున్నది. ఉదయుణ్ణి భద్రపరచు.

పన్నా: వనవీరుడే యీ భ్రాతృహత్యకు కంకణం కట్టుకున్నాడా బారీ !...

బారి : వనవీరుడు... వెనుకటి వనవీరుడు కాదమ్మా ! అడవి మృగంకంటె అన్యాయంగా ప్రవర్తిస్తున్నాడు. రాజమకుటాన్ని శిరస్సు నలంకరించి హృదయాన్ని విడిచిపెట్టాడు, మేవాడసింహాసనమధిష్ఠించి మానవత్వాన్ని మంటగలిపాడు, ఖడ్గాన్ని చేతబట్టి విచ్చలవిడిగా నెత్తుటేళ్లు పారిస్తున్నాడు.

పన్నా: ఈ క్రూరమృగాన్ని నేనే వేటాడుతాను, రాణావంశ రక్షణకు నా ప్రాణాన్ని సమర్పిస్తాను. లేకపోతే యీ దాయికి ఆత్మహత్యే శరణ్యం.

బారి : రసపుత్రులు శౌర్యాలు పెంచుకోవటం రాజపుత్ర స్త్రీలు ఆత్మహత్యలకు పాల్పడటం బాగా పరిపాటై పోయింది. మదపుటేనుగుముందుపడి మరణించేకంటే ఉపాయంతో వుచ్చులో బంధిస్తేనే బాగుంటుంది.

పన్నా: ఇది జీవన్మరణ సమస్య. మేవాడ పుణ్యస్థలం రక్త పిపాసుల కరాళతాండవానికి రంగస్థలమైపోయింది, యీ కారుచిచ్చును చల్లార్చకపోతే, సంగ్రామ సింహుని వంశాంకురమే నశించిపోతుంది యింక నింగి చూపులు మాని కర్తవ్యసాధనకు సిద్ధపడాలి. బారీ !...

బారి : ఏమిటి తల్లీ !

పన్నా: వనవీరుని ప్రాధేయపడతాను, కాళ్లు చేతులు పట్టు కుంటాను, తనఖడ్గానికి నా శిరస్సు నడ్డుపెడతాను...

బారి : ఆ దుర్మార్గుడు వింటాడాతల్లీ !

పన్నా: వినకపోతే వాడి కుంభస్థలాన్ని బ్రద్దలుకొట్టి నాప్రభు వును కాపాడుకుంటాను. (ఉదయుని దగ్గర కూర్చుని తల నిమురుతూ) కుమారా ! ఉదయ్ ! నీకు రాజ్య భారంలేదు, సంసారభారంలేదు, యీ ప్రపంచానికి నీవే భారమయ్యావా నాయనా ! ఈ పసితనంలో నీరక్తంత్రాగే శత్రువులు దాపురించారా ఉదయ్ !

బారి : పన్నా! ఉదయుణ్ణి ప్రశాంతంగా నిద్రపోనియ్

పన్నా: బారీ! ఉదయుడు నిద్రమేల్కొనకముందే యెక్కడి కైనా తీసుకొనివెళ్ళాలి.

బారి : ఉదయుణ్ణి చూపించకపోతే వనవీరుడు నిన్ను చిత్రవధ చేస్తాడు. నీవులేనిదే ఉదయుడు, చందనుడు జీవించ లేరు, నీవుతప్ప యీ ప్రపంచంలో వాళ్ళకు రక్షణే లేదు పన్నా !

పన్నా: కానున్నది కాకమానదు. గుండెరాయి చేసుకొని యీ దురాగతాన్ని యెదుర్కొంటాను. భారతనారి సబలత్వాన్ని నిరూపించి నా ప్రభువును కాపాడు కుంటాను.

ఉద : (నిద్రలో కలవరిస్తూ) అమ్మా! దాయమ్మా! అన్నయ్యా ... అన్నయ్యా ... ... మహారాణా! మేఘాల చాటునుంచి యెలా పారిపోతున్నాడో చూడు దాయమ్మా! దాయమ్మా! (నిద్రనుండి లేచి కూర్చుండును)

పన్నా: ఎందుకలా కలవరిస్తావు నాయనా! హాయిగా నిద్రపో!

ఉద : నాకేదో పీడకలవచ్చి భయంగావుందమ్మా! (మరల పండుకొనును)

పన్నా: (రహస్యంగా) బారీ! నీ దగ్గర కొంచం అభిని దొరుకు తుందా!

బారి : ఉన్నదమ్మా!

పన్నా: ఒక్కమోతాదు నాకివ్వు !

బారి : (జేబులోంచి బరిణతీసి ఒకమాత్ర అభిని అందించును)

పన్నా: (ఉదయ్యుణ్ణి లేపి కూర్చుండబెట్టి) బాబూ! ఉదయ్! ఈ మందుతిని మంచినీళ్లు త్రాగునాయనా! నీకు భయం తగ్గుతుంది. (త్రాగించి పరుండబెట్టి జోకొట్టును) బారీ! ఉదయ్యుణ్ణి దుర్గం వెలుపలకు దాటించే మార్గమే లేదా!

బారి : అంతఃపురంచుట్టూ పిచ్చుకత్తులతో సైనికులు పహారా తిరుగుతున్నారు.

పన్నా: (పొర్లుకొంటూ వస్తూవున్న దుఃఖంతో) ఈరాత్రితో రాణావంశం అంతరించిపోవలసిందేనా బారీ!

బారి : భయపడకు తల్లీ!

పన్నా: అంతఃపురబంధితులకు భోజనపదార్థములు యిచ్చి వెళ్లే అనుమతిపత్రము నీకున్నదికదా!

బారి : ఔను.

పన్నా : నీవు తెచ్చిన పండ్లగంపలో ఉదయ్యుణ్ణి భద్రపరచి మిగిలిన పండ్లు, పాత్రలు పైన పేర్చి సింహద్వారం దాటించకూడదా?

బారి : ఔను తల్లీ! ఈ ఉపాయం చాలా బాగున్నది.

పన్నా: ఇంక ఆలస్యమెందుకు!

బారి : సింహద్వారం దాటితే యేభయమూవుండదు.

పన్నా: సింహద్వారమేకాదు, యీ రాత్రే వేరిస్‌నది దాటి ఆరావళిపర్వతప్రాంతాలకు చేరుకోవాలి.

బారి : ఈ అర్ధరాత్రివేళ వేరిస్‌నది దాటుట చాలాప్రమాదం తల్లీ!

పన్నా: ఔను ప్రభువుప్రాణంకోసం యెన్నిప్రమాదములైనా యెదుర్కోనాలి.

బారి : ఆ నట్టడవిలో మనకు దిక్కెవరు పన్నా !

పన్నా: అజ్ఞాతవాసంలోవున్న నా భర్తతప్ప నాకీలోకంలో దిక్కెవరూ లేరు.

బారి : నీ భర్తా ! బహద్దూర్ సింగు! (ఆశ్చర్యంగా)

పన్నా: బ్రతికే వున్నారు. నా స్వామి బ్రతికే వున్నారు. (మంగళసూత్రాన్ని తీసి కళ్ళకద్దుకొని) యీ రహస్య మింకెవ్వరికీ తెలియదు.

బారి : మా బహద్దూరు బ్రతికేవున్నాడా! ఎక్కడున్నాడో చెప్పుతల్లీ!

పన్నా: ఆరావళీపర్వతగుహల్లో కాళీమాత పాదసేవచేస్తు న్నారు. ఆ దేవి పాదాలదగ్గరకు నా ప్రభువును చేర్చి వేడుకుంటాను.

బారి : కాళీ వుపాసనలోవున్న నీ భర్త అనుగ్రహిస్తాడా!

పన్నా: తప్పక అనుగ్రహిస్తాడు. రాణావంశమంటే నాభర్త కెంతో భక్తి, ఒకహస్తాన్ని సంగ్రామసింహుని విజ యాని కర్పించాడు. మిగిలినహస్తంతో అంతిమ విజ యానికి విజయశృంఖాన్ని పూరిస్తాడు, నాకా ధైర్య మున్నది ప్రభువును బ్రతికించినవాడవౌతావు, నా కోర్కె నెరవేర్చు బారీ !

బారి : అయితే వనవీరునికేమిసమాధానం చెబుతావు ?

పన్నా: వాడి పాపిష్టి నేత్రాల్లో దుమ్ముకొడతాను.

బారి : ఏవిధంగా !

పన్నా: ఉదయుని పాన్పుపై మరొకర్ని నిద్రపుచ్చుతాను.

బారి : మృత్యుదేవత ఒడిలో నీవు నిద్రపుచ్చేదెవర్ని ?

పన్నా: నా ముద్దుబిడ్డని... ... ...

బారి : హా !...

పన్నా: నా చందన కుమారుణ్ణి !

బారి : నీమాతృహృదయాన్ని మంటగలిపేస్తున్నావా తల్లీ!

పన్నా: బారీ! యిటుచూడు. యీ హృదయం వజ్రపురుషు కంటె కరుడుకట్టింది.

బారి : నీకెందుకుతల్లీ యింతసాహసం?

పన్నా: రాజపుత్రినైనందుకు, రాజస్థాన్‌లో జన్మించినందుకు

బారి : పసికందు ప్రాణం తీస్తావా !

పన్నా: ప్రభువు ప్రాణంకోసం...

బారి : అమ్మా! నీ దేశభక్తికి, నీ ప్రభుభక్తికి...

పన్నా: స్వార్థాన్ని త్యాగం చేస్తాను.

బారి : త్యాగానికి హద్దులులేవా తల్లీ !

పన్నా: జన్మభూమి సేవలో వుడుకురక్తం ఉప్పొంగినపుడు హద్దులు విచ్ఛిన్నమైపోతై...

బారి : నీలోమూర్తీభవించిన శక్తిస్వరూపం నాకు భయంకరంగా వున్నది, నీ నేత్రాల్లోని అగ్నిజ్వాలల్ని నేను భరించిలేను. యింక నే వెళ్తానుతల్లీ!

పన్నా: ఒక్కక్షణం ఆగుబారి ! (లోనికివెళ్లి చందనుని దుస్తులుతెచ్చి, చందనుని మెడలోని తావళము తీసి బారీకి అందించును.) ఉదయుడు నిద్రమేల్కొనగానే యీదుస్తులు ధరించి, యీతావళాన్నికూడా మెడలో కట్టు. యువరాజని యెవ్వరికి తెలియకూడదు. నేవచ్చు వరకు నాస్వామి బహద్దూర్‌క్కూడా తెలియకూడదు. తనబిడ్డ చందనకుమారుడనేచెప్పు. నమ్మకపోతే మెడ లోని తావళాన్నిచూపించు. ఇంక ఉదయుణ్ణి గంపలో పరుండబెట్టు బారీ !

బారి : (ఉదయుణ్ణి యెత్తుకొని) పన్నా ! నే నింక వెళ్లుతు న్నాను, నీవుత్వరగా గమ్యస్థానం చేరుకోవాలి, నీ కొరకు నిరీక్షిస్తుంటాను.

పన్నా: బారీ! వేరిస్‌నది జాగ్రత్తగా దాటించాలి.

బారి : ఆదేవి అనుగ్రహముంటే వేరిస్‌నదేకాదు సప్తసము ద్రాలు సునాయాసంగా దాటిపోతాను. సెలవు తల్లీ! (నిష్క్రమించును)

పన్నా: (తనకుమారునిపై దృష్టి మరల్చి దుఃఖిస్తూవుండును) చందన్!... చందన్!... ఈ అభాగ్యబాలకుడు మేను మరచి నిద్రిస్తున్నాడు. కుమారా! చందన్! ఈనాటి వరకు యువరాజుతో సమానంగా రాజభోగములనుభ వించావు నాయనా ! ఒక్క క్షణం ఆలస్యమైతే దాయమ్మా ! నా చిట్టితమ్ముడేడీ ? నా చిట్టితమ్ము డేడమ్మా అంటూ ఉదయుడు పరుగెత్తుకుంటూవచ్చే

వాడు. యువరాజుతోపాటు దాయిపుత్రుడు కూడా అన్ని సుఖాలు అనుభవిస్తున్నాడని అంతఃపురంలో అందరికీ అసూయపుట్టింది నాయనా! అందు కొరకే యీ సుఖాన్ని విడనాడి స్వర్గ సౌఖ్యాన్ని కోరుకుంటున్నావు. దేశంకోసం, ప్రభువుకోసం, ప్రాణాలర్పించి అమరత్వాన్ని పొందే అదృష్టం నీకు లభించింది, మాతృభూమి సేవలో తమ రక్తాన్ని సమర్పించిన వీరాభిమన్యుల సరసనచేరే భాగ్యం నీకు లభించిందా నాయనా! నా తల్లిహృదయం పాషాణం, నన్ను యెంతో సుకుమారంగా పెంచిన మమకా రాన్ని చంపుకొని నాజీవితాన్ని అంతంచేసిన హంతకు రాలని నాపై నిందమోపుతావా కుమారా! అందుకు ప్రతిఫలంగా నేను నరకంలో పతనమైపోతాను, నీ ప్రభువు ఉదయసింహుడు పట్టాభిషిక్తుడై మేవాడ సింహాసనం అధిష్టిస్తాడు, నీవు అంతస్థులోనే వుండి పోతావు, నీ గౌరవమర్యాదలకు లోటులేదు. వీర భూమిలో జన్మించిన నీవు వీరస్వర్గాన్ని అలంకరించి దైవసాన్నిధ్యాన్ని పొందగలుగుతావు తండ్రీ! అందు లకే మహారాణాలు శయనించిన పూలపాన్పు యీ రాత్రి నీకు లభించింది (బిడ్డను పాన్పుపై పరుండ బెట్టుచుండ)

చందన్: అమ్మా...... అమ్మా !

పన్నా: అమ్మ!... అమ్మా! ...అంటున్నావా కుమారా! ఆ పవిత్రశబ్దాన్ని కళంకపరచాను, నే నీ నారీలోకానికి పిశాచాన్ని. పసికందును చంపుకు తింటున్న విష నాగును. కన్నకుమారు శిరస్సు కసాయికత్తికందించి మాతృహృదయాన్ని మంటగలిపిన రాక్షసిని అమ్మా అని అమృతాన్ని ఒలికించావా కుమారా! నీ చిరు నవ్వులో విరజిమ్మే చంద్రకాంతులు నేటినుండి శూన్యంలో అదృశ్యమగునా చందన్! నరకకూపా లైన యీ పాపిష్టిసౌధాల్నింక నీకళ్లతో చూడవద్దు, హాయిగా మేనువాల్చి సుఖంగా నిద్రపో, నీ జీవితాని కింక మేల్కొలుపులేదు (ద్వారంవైపుచూచి) రాత్రి మూడవఝాములో ప్రవేశించింది, యీ ఝాము రాత్రి గడిస్తే అంధకార మంతరించిపోతుంది (చంద నుని ముఖాన్ని చూడాలని ప్రయత్నించి మరల ఆగి) కుమారా! ఈ దీపకాంతిలో నీ సుందరవదనాన్ని తనివితీరా చూస్తూ మానవత్వాన్ని మరుగుపర్చలేను నాయనా!

[చందనుడు కనుపించకుండ పూర్తిగా దుప్పటికప్పును. చందనునకు మారు నేలపై రెండు దిండ్లుపెట్టి కను పించకుండ దుప్పటికప్పును. నాలుగువైపులా చూచి దీపము ఆర్పి బిడ్డదగ్గర కూర్చుని దుఃఖిస్తూవుండును]

(నేపథ్యంలో గంభీరంగా) పన్నా!... ...పన్నా!...

పన్నా: (భయకంపితురాలై హటాత్తుగా లేచి ద్వారంవద్ద నిలబడును)

వన : (రక్తంలో తడిసిన ఖడ్గాన్ని చేతబట్టి ప్రవేశించి) ఉదయుడెక్కడ ?

పన్నా: ఈ భయంకరాకృతిలోవున్న నీవు…. …

వన : ఆకలిగొన్న కొదమసింగాన్ని

పన్నా: ఈ ఖడ్గంపై మెరసేరక్తం ?

వన : శైయ్యలోవున్న విక్రమునిది.

పన్నా: హా ! … త్రోవదప్పివచ్చావు ఆకలిగొన్న కొదమ సింగాని ఆహారం…

వన : అంతఃపురంలోనే లభిస్తుంది.

పన్నా: అన్నదమ్ములను వధించి శ్మశానభూమిని పరిపాలిద్దా మనుకున్నావా ?

వన : శ్మశానంకాదు మేవాడ సర్వనాశనమైనాసరే ఉద యుణ్ణి అంత మొందించాలి.

పన్నా: అంతవైరుధ్యానికి కారణమేముంది. ఉదయుడేమైనా నీపై యుద్ధం ప్రకటించాడా ?

వన : ఇకముందు అలాంటి యుద్ధాలు రాకుండా అరికట్ట టానికే ఉదయుణ్ణి తుదముట్టించాలి.

పన్నా: ఉదయునకు నీవే సర్వరక్షకుడన నేమాట మరచినావా?

వన : నేనిప్పుడు సర్వభక్షకుణ్ణి, నీ అంగరక్షణ కూడ నేటితో సమాప్తి.

పన్నా: పాపపుణ్యాలకు తారతమ్యం గుర్తించావా ?

వన : గుర్తించాను.
పన్నా: గుర్తించికూడా అర్ధరాత్రివేళ ఆయుధాన్ని చేబట్టి అంతఃపుర ప్రవేశంలో అంతరార్థం ?
వన : ఆఖరిశత్రువును అంతమొందించటానికి.
పన్నా: అది రసపుత్రుని కర్తవ్యమా ?
వన : మాతృ ఆదేశం

పన్నా: ఆడదానిమాట విని భస్మాసుర వరాల్ని కోరుకుంటున్నావు.
వన : పన్నా !
పన్నా: ఆ రాక్షసినే పంపకపోయావా ఈ హత్యాకాండకు !
వన : నా తల్లినే దూషిస్తావా చండాలి. యింక నాదారి కడ్డంలే.
పన్నా: జాగ్రత్త. ముందు నన్ను వధించి తరువాత ఉదయుణ్ణి.
వన : ఊఁ. (ముందుకురకబోవును)
పన్నా: ఆగు! హంతకుడా! అడుగు ముందుకువేసావా...... నీ గుండె చీలుస్తాను (ఖైజారుతీసి వనవీరుని గుండెపై పొడవబోవు)
వన : (చేయిపట్టుకొని బలవంతంగా నెట్టగా పన్నా దూరంగా పడిపోవును చేతిలో ఖైజారుజారి క్రింద పడగా వనవీరుడు పాదముక్రింద త్రొక్కిపట్టును. ఉదయుని సంహరించుటకు ఖడ్గాన్ని పైకెత్తగా పన్నా మరలవచ్చి పైకెత్తిన వనవీరుని హస్తాన్ని అలాగే పట్టుకొని)

పన్నా: నీ ఖడ్గసంకేతం చూడుపాపి!... ...నరకానికి మార్గం చూపిస్తున్నది. ఒక్కసారి పైకిచూడు.

వన : నరకానికికాదు. అది స్వర్గానికిమార్గం అహ్హా హ్హా !! (గంభీరంగా) రంజిత్ !

రంజి : (ప్రవేశించి) ప్రభూ !

వన : ఈ పిశాచాన్ని దూరంచెయ్యి (పన్నాను దూరంగా నెట్టును)

రంజి : (ఖడ్గాన్నిదూసి పన్నాకు అడ్డుపెట్టును)

వన : (ముసుగులోవున్న చందనుని శిరస్సు ఖండించును)

పన్నా: ( దిక్కులు పిక్కటిల్లునట్లు ఆర్తనాదం చేసి మూర్ఛిల్లును)

రంజి : మహారాణా వనవీర్ జైహో !

వన : అహ్హా హ్హా ! !
(వికటాట్టహాసంచేస్తూ నిష్క్రమింతురు)

తెర



# ప న్నా

## ప ం చ మా ం క ము

[నేపథ్యంలో దూరాన్నుంచి చక్కని వాయిద్య సంగీతము నాట్యకత్తెల మువ్వలధ్వని వినబడుతుండును. శీతల్ సేని యెంతో వుత్సాహంతో మందిరమంతా అలంకరిస్తూవుండును]

రంజి : (ప్రవేశించి) వందే మహారాణీ !

శీత : రంజిత్ ! ఈ రోజు నాకెంతో ఆనందంగావుంది.

రంజి : ఔను మహారాణీ ! రాజభవనమంతా నృత్యగానములతో మార్మ్రోగుతూ సరస్వతీ నిలయమనిపిస్తుంది.

శీత : రాజభవనమేకాదు రంజిత్ !...

రంజి : మేవాడరాజ్యమంతా అలాగేవుండాలని మహారాణీ కోర్కె !

శీత : ఔను

రంజి : రాజమాత అనుగ్రహముంటే అన్నీ అనుకూలంగానే జరిగిపోతై.

శీత : అనుగ్రహంకాదు రంజిత్ ! కార్యదీక్షవుండాలి. ఆదీక్షతోనే సంగ్రామసింహుని వంశాన్ని సర్వనాశనం చేసాం, ఆ పట్టుదలతోనే పగసాధించాం, వనవీరుని శక్తిసామర్థ్యాలు, ధైర్యసాహసాలు నా గుప్పెట్లో యిముడ్చుకున్నాను. వనవీరుని ఖడ్గం నా ఆదేశం పాటించునంతవరకు నా హృదయగోళంలో విహ

రించే కోర్కెలన్నీ ఫలిస్తవి. నా వనవీరునకింకేం కావాలి, రాజముకుటాన్ని శిరస్సునలంకరించి మేవాడు మహారాణాను చేస్తాను. అవసరమైతే ఢిల్లీ సింహాసనంపైనే అధిష్టింపచేస్తాను.

రంజి : విరోధివర్గమంతా రూపుమాసిపోయింది, కంటక ప్రాయమైన రాజపథంలో నేడు పూలు వర్షిస్తున్నవి.

శీత : ఔను రంజిత్ !

రంజి : ఇంక రాజతిలకానికి ఆలశ్యమెందుకు మహారాణీ !

శీత : అనుకున్నవన్నీ అంచలప్రకారం జరుగుచున్నప్పుడు పట్టాభిషేకం మాత్రం ఆగుతుందా !

రంజి : ప్రభువుల పట్టాభిషేకం వైభవోపేతంగా జరగాలి, మేవాడప్రజల్లో నూతనోత్సాహం వెల్లివిరియాలి; మహారాణీ ! అనేకమందిగాయకులు, నర్తకులు ఉత్సవాల్లో పాల్గొనుటకు తమ అనుమతికోరుతున్నారు.

శీత : ఆ ఏర్పాట్లన్నీ నీ చేతులమీదుగానే జరగాలి.

రంజి : మహారాణీ ! మరి ... నాకు ... చెందవలసిన ...

శీత : ప్రధానామాత్యుని ప్రమాణస్వీకరణ, ప్రభువుల పట్టాభిషేకం ఒకేముహూర్తంలో జరుగనున్నవి, విచారించవద్దు రంజిత్! నేను రాజగురువుతో సంప్రదించి ముహూర్తం నిర్ణయించుకొస్తాను (నిష్క్రమించును)

రంజి : నా అదృష్టం ఈ నాటికైనా ఫలించాలి, రాజ్యమేలే రాజులెవరైతే నాకేమి ! రాజులు రాజుల్లు రణరంగంల్లో సర్వనాశనమైతే నాకేమి ! ఈ రంజిత్ సిం

హుడే ప్రధానమంత్రిత్వం స్వీకరించాలి. అంతవరకు ఈ రక్తపాతానికి వెనుదీయను. చిత్తూరుదుర్గంలో చిచ్చు పెట్టి మేవాడరాజ్యానికంతా ప్రజ్వలింప చేస్తాను. రాజస్థానమంతా రక్తమయం చేస్తాను.

వన : (వెనుకనుండి ప్రవేశించును)

రంజి : మహారాణా ! వనవీర్ ! జైహో !

వన : అహ్హా హ్హా !! మహా... రాణా... వనవీర్ జైహో ! అహ్హా హ్హా !! నిన్నటివరకు రాణా విక్రమసింహునికి ధ్వనించిన శ్రుతులు నేడు మహా... ...రాణా... వన వీర్ ...జైహో ! అహ్హా హ్హా !!

రంజి : మేవాడ సర్వస్వం ఒకేస్థాయిలో ధ్వనిస్తుంది ప్రభూ !

వన : అహ్హా హ్హా ! (సంతోషంగా) రంజిత్ !

రంజి : ఔను ప్రభూ! మీరు మేవాడకు ఏకఛత్రాధిపతులు, ఏకధాటిగా పరిపాలించాలి.

వన : నేటి మేవాడప్రజానీకం తమ వినతిపత్రాలు ...

రంజి : మీకు సమర్పించుకోవాలి.

వన : రసపుత్రసైన్యమంతా ...

రంజి : మీ ఖడ్గానికి ప్రణమిల్లాలి.

వన : రంజిత్ !

రంజి : ప్రభూ !

వన : ఈ నూతనపరిణామదశలో ప్రజలభిప్రాయమేమైనా సేకరించావా !

రంజి : ఈ శుభవార్తవిని ప్రజలంతా ...

వన : ఏమంటున్నారు ?

రంజి : ఎంతో ఆనందపడుతున్నారు, రాజధానిలోని రస పుత్రులందరూ రాక్షసప్రభుత్వమంతరించి రామ రాజ్యమొచ్చిందని సంతోషపడుతున్నారు, రాజ మార్గాలు, పౌరవీధులన్నీ పచ్చని తోరణాలతో అలంకరించారు.

వన : సంగ్రామసింహుని వంశరక్షణకు కంకణంకట్టుకొన్న పన్నా జాడ లేమైన తెలిసినవా ?

రంజి : కంకణంకాస్తా రాణాల రక్తప్రవాహంలో కొట్టుకు పోయింది. దిక్కులేనిదాయి తనబిడ్డనెత్తుకొని రాజ స్థాన్ వీడి పోయిందని విన్నాను ప్రభూ !

వన : రంజిత్ !

రంజి : ప్రభూ !

వన : విక్రమ ఉదయుల చావుకెవరైనా విలపిస్తున్నారా ?

రంజి : ప్రభువుల విజయఢంకా నినాదాలలో విక్రమ ఉద యుల చావు యేడ్పులు యే శ్రుతిలో లీనమైనవో వినుపించుటలేదు ప్రభూ !

వన : అహ్హా హ్హా !!

రం : నేడు మేవాడ ప్రతియింటిలో దీపావళికాంతులు విర జిమ్ముతున్నవి. వీధులలో పురజనులంతా గుంపులు గుంపులుగాచేరి బాణసంచాచేస్తున్నారు, ప్రభువుల దర్శనంకొరకు అనేకప్రాంతాలనుండి వచ్చిన యాత్రి కులతో రాజధాని క్రిక్కిరిసిపోయింది. నేడు మేవాడ ఒక పుణ్యభూమిగా ప్రకాశిస్తుంది ప్రభూ !

కర్మ : (ప్రవేశించి) పుణ్యభూమికాదు రుద్రభూమిగా పొగలు విరమ్ముతుంది.

వన : ఎవరినోటివెంట యీఅమంగళ వాక్యములు.

రంజి : ప్రధానామాత్యులు.

కర్మ : ప్రధానామాత్యునిగా మీ సమక్షంలో మాట్లాడుట లేదు.

వన : మరి ... స్వాతంత్ర్యముగా శాసిస్తున్నారా ?

కర్మ : అసంభవం... ...ఒక మేవాడ సామాన్య పౌరునిగా మాట్లాడుతున్నాను.

వన : ఏమని ?

కర్మ : ఈ రాజభవనంలో కూర్చుని మీరుచేస్తున్న దుర్మార్గాలను ప్రజలు సమర్థిస్తున్నారని మీలోమీరు ఉబలాట పడుట కేవలం అజ్ఞానమంటాను.

వన : మా ఆదేశాలు ప్రజలంగీకరించుటలేదని మాతో చెప్పవచ్చారా ?

కర్మ : ఆదేశాలు కట్టిపెట్టండి. మీ వీరావేశాలతో మేవాడ భగ్గున మండిపోతున్నది. ఆ మంటలు నీటితో చల్లారేవి కావు. మీఆదేశాలు కేవలం హత్యలతో, రక్తపాతంతో మూర్తీభవించియున్నవి. కళ్లు తెరచి ప్రజల ముందుకొస్తే మీ ఆదేశాల సారాంశమేంటో అర్థమవుతుంది.

రంజి : స్వామ్రాట్టు సమక్షంలో ప్రధానామాత్యుడు యింత నిర్లక్ష్యంగా మాట్లాడుట సహించరాని విషయం ప్రభూ !

కర్మ : ఛీ...నీచుడా !

రంజి : కర్మచంద్ !

కర్మ : రాజప్రాంగణంలోజరుగుచున్న దుర్మార్గాలకు, దుశ్చర్యలకు, కారకుడవు నీవేనని మాకు తెలుసు. పదవికోసం, పలుకుబడికోసం, దుష్టరాజకీయాలకు దాసుడవై, దుష్టనియంతలకు బానిసవై రాజపుత్రవంశంలో చెడబుట్టావు.

రంజి : ప్రభూ !

కర్మ : ఛీ... ...నీ ముఖం చూడకూడదు.

రంజి : కర్మచంద్ ! వృద్ధుడవని ఉపేక్షిస్తున్నాను. జాగ్రత్త!

కర్మ : రంజిత్ ! నీవు రాజద్రోహివి, దేశద్రోహివి, నా యెదుట మాట్లాడే అర్హతకూడా నీకు లేదు. శునకానికి కనకసింహాసనం లభించినట్లు, మేవాడకు చెడు రోజులు దాపురించి అధికారం అల్పుల హస్తగతమైంది.

వన : ఆనాడు నీవు, జయసింగు ప్రజానాయకత్వంవహించి రాణావంశంలో మగటిమిగల వీరులెవ్వరూ లేరని రాజమకుటాన్ని నా చేతికందించారు, రాజస్థాన్ గొడ్డుపోయిందని మీరా తండ్రికొడుకుల ప్రోద్బలం వలనే యీ రాచరికాన్ని స్వీకరించాను. నేను సర్వసమర్థుడ ననే ప్రజానీకం ఆ రోజు అంగీకరించింది.

కర్మ : ఆ రోజు నీకు అగ్రాసనం అందించింది, సర్వాధికారాలు నీ హస్తగతం చేసింది పాలితులసుఖజీవనం

కోసం, రాజ్యంలో శాంతి, సుభిక్షాలు నెలకొల్ప టానికి, విక్రముని దుర్వ్యసనాలనుండి దూరంచెయ్య టానికి తాత్కాలికంగా నిన్ను ప్రభువుగా ఎంచు కున్నారు; రాజమకుటంతో పాటు విక్రమ, ఉదయుల సంరక్షణభారంకూడా నీ హస్తగతంచేసాం, అంతే గాని మారణాయుధాన్ని నీచేతికందించలేదే! రస పుత్రులు చేబట్టిన ఖడ్గం మాతృభూమి రక్షణకోసమే గాని భ్రాతృహత్యలకోసం కాదు స్వామ్యాస్టులకు సరి హద్దులు లేవని గ్రహించావు కాబోలు.

వన : విక్రమ, ఉదయుల హత్యలకు కారకులెవరని నీఉద్దేశ్యం?

కర్మ : ఈ హత్యాకాండ నేకంటితో చూడనంతమాత్రాన మాతృభూమి కళ్లు కప్పలేవు.

రంజి : కర్మచందు బెదరింపులకు భయపడనవసరంలేదుప్రభూ!

కర్మ : మేవాడ రాజవంశపతనానికి ప్రముఖపాత్ర వహించిన నీవు వనవీరుని ఖడ్గంపై రక్తపుచారల్ని మరుగు పర్చలేవు జాగ్రత్త!

వన : నా సమక్షంలో మీరంతా సింహాన్ని పట్టి బంధించారు, నేను వధించాను. దెబ్బతిన్న సింహం యేనాటికైనా పుచ్చులుత్రెంచుకొని ముందు నాపైకి ఉరుకుతుంది, తరువాత మేవాడ సర్వస్వాన్ని కబళించి నెత్తుటేళ్లు పారిస్తుంది. ఆనాడు అమాత్యులేమైన అడ్డుపడగలరా!

రంజి : అడ్డుకున్నవారినే ఆహారంగా స్వీకరిస్తుంది.

వన : ఆ ప్రమాదాన్ని వారించాను. విరోధి రక్తంతో దాహం తీర్చుకున్న నా ఖడ్గాన్ని మరుగుపర్చను, మేవాడ ప్రజాసమక్షంలో దాన్ని ప్రదర్శిస్తాను, మేవాడచరిత్రలో దాన్ని చిత్రిస్తాను, ప్రజాద్రోహుల రక్తాన్ని చిందించి మేవాడ పతనాన్ని అరికట్టిన వీర ఖడ్గమని చరిత్రే నిరూపిస్తుంది.

కర్మ : ఔను ! నిరూపిస్తుంది. సంకెళ్లుతగిలించి ఖైదులో బంధించబడిన సోదరునితో, నిద్రపోతున్న పసికందుతో హోరాహోరిగా యుద్ధంచేసిన వీరాధివీరుడవని చరిత్రే నిరూపిస్తుంది.

వన : పసికందు పీక నరికినఖడ్గం వడిలిపోయిన ఈముసలి రక్తాన్నికూడా ప్రవహింపచేస్తుంది.

కర్మ : ఊహు... ప్రవహింపచేస్తుంది. ఆ ప్రవాహం గట్లు తెగిన రోజు నీవు...నీ ఖడ్గం ... నీసింహాసనం బదాబదలై సముద్రగర్భంలో కలిసిపోతారు... నన్నుకూడా వధిస్తావా! పాపి, హంతకుడా ... నీ విషపూరితమైన శ్వాసతో రెండుజ్యోతులను ఆర్పివేశావు. నాదుర్బల స్వరంతో మేవాడ నలుమూలలా ప్రతిధ్వనింపచేస్తాను మేవాడ సింహాసనంపై హంతకుడు కూర్చున్నాడని. నిన్ను పదవీభ్రష్టుణ్ణి చేసేవరకు మేవాడప్రజలు నిద్రించరు. నన్నేవధిస్తావా చండాలుడా !

రంజి : (కత్తిదూసి) అనుజ్ఞయివ్వండి ప్రభూ ! అంతకంతకు రెచ్చిపోతున్న యీ ముసలి పీనుగనంతమొందిస్తాను

కర్మ : రంజిత్ !...

వన : (రంజితుని పట్టుకొని) శాంతించు రంజిత్ !...కర్మ చంద్ ! నేటినుండి రాజ ప్రాంగణంలో ప్రవేశించే అర్హతనీకులేదు. ఆరోజు నాకీఅధికారం అక్కరలేద న్నాను. బలవంతంగా కట్టబెట్టిన యీ సింహాసనాన్ని శాశ్వతంగా నిలబెట్టుకొనుటకే నా శత్రువులంత మొందించాను. మీ దుష్ట ప్రచారాన్ని నిర్విఘ్నంగా సాగించండి. రాజతిలకానికి ముహూర్తనిర్ణయంకూడ జరిగింది.

కర్మ : సంతోషం, మీ తల్లి మహారాణీ... కాదు ...మహా మారి శీతల్‌సేని మేవాడశ్మశాన భూ... లో లభించే బూడిద తెచ్చి నీముఖాన్ని అలంకరిస్తుంది...

వన : కర్మచంద్ !

కర్మ : మేవాడ శూన్యప్రదేశంలో (రంజితుని చూపించి) యీ పరమలోభి...

రంజి : ప్రభూ !

కర్మ : నీకు పట్టాభిషేకమహోత్సవం జరుపుతాడు. ఆ రోజు మేమంతా ఆనందిస్తాం, నీపట్టాభిషేకమహోత్సవానికి మేమంతా యజ్ఞపశువులుగా బలికి సిద్ధపడతాం... నన్నుకూడా వధిస్తావా...మూర్ఖుడా...(నిష్క్రమించును.)

వన : (కర్మచందును వెంబడిస్తూ) కర్మచంద్ !... కర్మ చంద్ !...

శీత : (ప్రవేశించి) వనవీర్ ! ఆగు ! కర్మచంద్రుడు వెంటబడే అధోగతి నీకుపట్టలేదు.

రంజి : ఔను ప్రభూ ! కర్మచందును శత్రుకూటమిలో నే చేర్చాలి, లేకుంటే మీ శిరస్సుపై తిష్ట వేస్తాడు. మీరు మేవాడకు సర్వాధికారులు, ధనాగారములన్ని మీ చేతిలోవున్నవి, సైన్యమంతా మీ యాసుపులో వున్నది. భయపడనవసరంలేదు ప్రభూ !

వన : నిస్సందేహంగా, రంజిత్ !

రంజి : ప్రభూ !

వన : నీవు నాకు అండగావుంటే యీ ప్రపంచాన్నే జయిస్తాను. ఈ క్షణంలోనే ధనాగారములన్నీ బద్దలుకొట్టి సైన్యానికి విరజిమ్ముతాను (నిష్క్రమించును)

శీత : రంజిత్ ! కూకటి వేళ్ళతో నేటివరకు నాటుకు పోయిన యీ ప్రధానమంత్రి కర్మచందు యింకా నీ పాలిట మిగిలి యున్నాడు. రాజప్రాసాదందాటక ముందే యీ నాగుబెమ్ముణ్ణి అంత మొందించాలి అప్పుడే చిత్తూరుదుర్గం శత్రునిశ్శేషమౌతుంది. వాడి రక్తపు మడుగులోనే మేవాడ ప్రజానీకం పారాయణ మలంకరించుకొని ప్రభువుల పట్టాభిషేకమహోత్సవంలో పాల్గొనాలి, త్వరగా వెళ్లు.

రంజి : చిత్తం మహారాణీ (ఖడ్గాన్ని సవరిస్తూ నిష్క్రమించును)

తెర

# పన్నా

## షష్ఠాంకము

[చక్కగా అలంకరించిన దర్బారు రిక్తంగా కనుపించును. నేపథ్యంనుండి వాయిద్యకోలాహలం వినుపించును, శీతల్‌సేని చక్కగా ముస్తాబై ప్రవేశించి దర్బారు అలంకరణ తిలకిస్తూ తనలోతాను మురిసిపోతుండును. ఇంతలో వనవీరుడు, రంజిత్ ప్రవేశింతురు]

రంజి : మహారాణా వనవీర్ ! (ఎవ్వరూ జైకొట్టరు)

వన : (ఎంతోనిరుత్సాహపడి) అమ్మా ! రాజతిలక మహోత్సవానికి సర్వసన్నాహములు పూర్తి అయినవా?

శీత : పూర్తి అయినవి కుమారా !

వన : రంజిత్ ! సామంతరాజులందరకూ సకాలంలో శుభలేఖలందించావా ?

రంజి : చిత్తం ప్రభూ !

వన : ముహూర్తసమయం సమీపించినను, సామంతులు, సైన్యాధిపతులు కనుపించరైరి ? సర్దారులు సైతము యింతవరకు రానికారణం ?

రంజి : నాకే ఆశ్చర్యముగ నున్నది ప్రభూ !

వన : అమ్మా ! జనశూన్యమై, కళావిహీనమై, వందిమాగధులే వినిపించక వట్టిపోయిన యీదర్బారులో నాకు పట్టాభిషేకమహోత్సవం జరుప నిశ్చయించితివా ? యిది మనకు ఆనందదాయకమా తల్లీ !

శీత : కుమారా ! నీవు మహారాణా సింహాసనం అధిష్ఠించి శాసనాధికారాన్ని చేబట్టిన మరుక్షణాన్నే మేవాడ సర్వస్వం నీపాదాక్రాంతమగును. నీకీర్తి గానంతో మేవాడ నలుమూలలూ ప్రతిధ్వనించును విచారించ వద్దు కుమారా !
[బంగారు పళ్లెరములో కిరీటము, పూజాద్రవ్యము లుంచి రాజగురువు ప్రవేశింపగా అందరూ నమస్క రింతురు.]

రాజ : "సమస్త సన్మంగళానిభవంతు" పట్టాభిషేకమహోత్స వానికి శుభప్రదమైన లాగ్నిక ఘడియలు సమీపింప నున్నవి ప్రభూ !

శీత : మీరు విఘ్నేశ్వరపూజ ప్రారంభించండి,

రాజ : ప్రధానామాత్యులు లేకుండ పూజ ప్రారంభించుట రాచరికానికి శ్రేయోదాయకం కాదు మహారాణీ !

శీత : ప్రధానామాత్యులున్నారు. వారి సమక్షంలోనే రాజ తిలకం జరుగుతుంది. ప్రారంభించండి.

రంజి : (తనలోతాను మురిసిపోతుండును)

శీత : (ద్వారంవద్దకువెళ్లి) మేవాడ క్షేమంకోరి ప్రభువుల క్షేమంకోరి విద్యాధరులందరూ మంగళగీతం పాడండి! (నేపథ్యంలోనుండి యెవ్వరూపాడరు) ఊ... మీరు కూడా మాతో వ్యతిరేకించి యీ మహోత్సవాన్ని బహిష్కరిస్తున్నారా ! పాడండి యిది మహారాణి ఆజ్ఞ ! (నేపథ్యంనుండి వాయిద్యకోలాహలం)

జయ : (వేగంగా ప్రవేశించి) ఆపండి యీ మంగళగీతం! యీ రాజతిలకమహోత్సవాన్ని భగ్నంచెయ్యటానికే సిద్ధపడుతున్నాను.

శీత-వన: (గంభీరంగా) జయసింగ్ !...

జయ : ఔను ! జయసింగే ! ఎవరి రక్తపుమడుగులో మీ పాపిష్టిపాదములు తడిపి యీ దర్బారులో ప్రవేశించాలో ఆ వృద్ధ అభాగ్యునికొడుకు జయసింగే !

శీత : ఆవేశపడవద్దు జయసింగ్ !

జయ : ఆవేశంకాదు హృదయంలో రగుల్తున్న అగ్ని ...

శీత : నీ హృదయంలో రగుల్తున్న అగ్నికి బాధ్యులం మేముకాదు.

వన : జయసింగ్ ! యీ దర్బారులోవున్న ప్రధానామాత్యుని రిక్తాసనం మాకు దుఃఖాన్ని కలిగిస్తున్నది. మేవాడమహారాణా చేరువలోనున్న యీ ఉన్నతాసనాన్ని నీవే అధిష్ఠించి యీ శుభకార్యాన్ని జయప్రదం కావిస్తావని ఆశిస్తున్నాం.

రంజి : ప్రభూ ! శత్రువర్గానికి భయపడి మీవాగ్దానాన్ని భంగపరుస్తున్నారు.

జయ : పదవులకోసమాసించి మీ అడుగులకు మడుగులొత్తే (రంజితునిచూపించి) ఈ నీచజాతిలో జన్మించలేదీ జయసింగు.

రంజి : ప్రభూ! ఈ దర్బారులో నాకు జరుగుతున్న అవమానాన్ని మీరు చూస్తూ ఉపేక్షిస్తున్నారు. నేను మాత్రం సహించలేను. నేటినుంచి మీకూ. మీ కొలువుకూటానికి దూరమైపోతున్నాడు యీ రంజిత్ ... (వెళ్ళబోవును)

జయ : (రంజితుకు అడ్డువచ్చి) ఆగు! ఎక్కడికి వెళ్తావు! ప్రాణ రక్షణకోసం పారుబోతుగా ప్రవర్తించవద్దు. యీ మేవాడభూమితో ప్రతి అణువుకూ నీవు ద్రోహం తలపెట్టావు. మహారాణా వంశవృక్షానికి కారుచిచ్చు రగిల్చి కాలికి బుద్ధిచెబుతున్నావా ద్రోహీ! నా ముసలితండ్రి పవిత్రమైన రక్తం యేరాజమార్గంలో నేటివరకు కరుడుగట్టివున్నదో అదేమార్గంలో నీ రక్తాన్ని త్రాగుతాను. నా తండ్రి ఆత్మకు శాంతి లభించేవరకు నిన్ను ముక్కల ముక్కలుగ తరుగుతూనే వుంటాను. (రంజితును మెడపట్టి వెలుపలకు నెట్టి) సర్దార్ సింగ్! ఈ కిరాతకునిపట్టి బంధించండి. నేనేవచ్చి వీణ్ణి చిత్రవధ చేస్తాను.

(నేపథ్యంలో) సర్దార్ జయసింగ్ జైహో! సర్దార్ జయసింగ్! జైహో!!!!

శీత జయసింగ్! నీకు సమర్పింపనున్న అధికారాన్ని కాలదన్ని. విరోధిగా మామార్గాన్ని నిరోధిస్తున్నావు జాగ్రత్త!

జయ : కుమారుని పట్టాభిషేకంతో నీ ఆశాసౌధాన్ని పూర్తి చేద్దామని నిర్దోషుల రక్తంతో మూడునదులు పారించావు, ఆ రక్తంలో స్నానమాడి యీ పాపపంకిల మైన పట్టాభిషేకమహోత్సవంలో నన్ను పెద్దరికం చెయ్యమంటున్నావా మూర్ఖురాలా !

వన : (ఆగ్రహంతో) జయసింగ్ !

శీత : తండ్రి మరణించిన శోకంలో నీ బుర్ర చెడిపోయింది. కొంచం స్థిమితపడు. ఈ శుభసమయంలో మేను మరచి మాట్లాడవద్దు.

వన : జీవితంపై ఆశల్ని దూరంచేసుకోనవద్దు.

జయ : ఏనాడో దూరంచేసుకున్నాను. జీవించుటకు నాకీ ప్రపంచంలో మీరు మిగిల్చినదేమున్నది ! విక్రముని దారుణహత్యతో నా గుండె బ్రద్దలయింది, ఉదయ సింహుని ముఖారవిందంచూచి కన్నీటిప్రవాహాన్ని ఆపుకుందామనుకున్నాను. కన్నతండ్రి సేవలో మహో రాణా వంశానికి సంభవించిన పతనావస్తనే మరచి పోదామనుకున్నాను. నీ కసాయికత్తి నా ఆశల్ని దూరంచేసింది.

వన : వ్యతిరేకశక్తులు సమూలంగా నాశనమయ్యేవరకూ యీ కసాయికత్తి విశ్రమించదు.

జయ : కత్తిచూపించి భయపెడుతున్నావా ! హంతకుడా ! సంకెళ్లు తగిలించుకొని ఖైదులోకూర్చున్న విక్రముడు కాదు యీ జయసింగు,...... అంతఃపుర శయనా

గృహంలో నిద్రించు ఉదయసింహుడు కాదు యీ జయసింగు, ... నిశీధిలో ఒంటరిగా రాజమార్గంలో నడచిపోతున్న వృద్ధకర్మచందు కాదు ఈ జయసింగ్ ... (కత్తిదూసి) నీ గుండెలు బ్రద్దలుకొట్టి నీ రాజ్యకాంక్షను తుదముట్టిస్తాడు యీ జయసింగు. భ్రాతృహంతకుల రక్తస్రవంతిలో యీ పట్టాభిషేకమహోత్సవం భీభత్సమైపోవాలి, జయసింగు శిరస్సు నేలపై రాలిపోయిన తరువాతనే నీ శిరస్సుపై ఈ రాజమకుటం.

శీత : వనవీర్ ! ఈ జయసింగు మనపాలిట శకునపక్షి. కాలయాపనకూడదు, ముహూర్త సమయం మించిపోతుంది, ఈ రాజతిలకాన్ని నేనే... ...

జయ : నీవా ! రక్తపుకూడుతినే రాక్షసీ ! పవిత్ర హిందూ వనితల సౌభాగ్యలక్ష్మి యైన ఈ వీరకుంకుమాన్ని నిన్ను ముట్టనీయను.

వన : ఈ ముహూర్తసమయంలో ఖడ్గాన్ని ఒరలో నేవుంచదలచాను.

(నేపథ్యంలో) మహావీర్ జయసింగ్! జైహో!!! మహావీర్ జయసింగ్ జైహో!!! మహావీర్ జయసింగ్ జైహో!!!

వన : రాజగురూ ! వేదోక్తంగా మీ కార్యక్రమాన్ని ప్రారంభించండి.

జయ : రాజగురూ ! యిది పట్టాభిషేకంకాదు, పిశాచాల హోమగుండం, మీ పవిత్ర వేదపఠనాన్ని కళంకపరచక వెళ్ళిపొండి... ఊఁ.

రాజ : (వెళ్లుటకు ప్రయత్నించును)
శీత : వెళ్ళకండి.
రాజ : వేగోక్తంగా నాధర్మాన్నింక నిర్వహించలేను. మహా రాణీ! సెలవు……… (కిరీటాన్ని అక్కడే నేవుంచి నిష్క్రమించును)
శీత : రాజగురూ!… రాజగురూ!…
జయ : అహ్హా హ్హా హ్హా !!!!!!
శీత : కుమారా! ఈ రాజతిలక మహాసభ వీరావేశాలతో ప్రతిధ్వనిస్తుంది. మాతృదేవికి మించిన దైవసమానులు మరెవ్వరూ లేరు, నేనే ఈ రాజమకుటాన్ని నీ శిరస్సు నలంకరిస్తాను. (మకుటాన్ని వనవీరుని శిరస్సుపై నుంచుటకు ప్రయత్నించును)
పన్నా: (వేగంగా ప్రవేశించి) ఆగు! రాక్షసి! (శీతల్ సేని చెయ్యి పట్టుకొనబోవును)
శీత : (విదిలించుకొని) దాసీ! దూరంగావుండు.
పన్నా: దాసీనే, మహారాణా వంశానికి, మేవాడ ప్రజానీకా నికి దాసీనే కాని నీ పాలిట మృత్యుదేవతను.
శీత : రాజమాతనే ధిక్కరిస్తున్నావా చండాలీ!
పన్నా: రాజమాత, అహ్హా హ్హా హ్హా!!!!! చెప్పుకొనుటకు సిగ్గు లేదు. గతించిన నీ బ్రతుకంతా మరచి గర్విస్తు న్నావు. ఒకనాడు భుక్తికోసం అంతఃపురంలో ప్రవే శించి దాసిగా ఊడిగంచేసావు, మరికొంతకాలానికి వుంపుడుగత్తెగా మారి పృధ్విరాజు హృదయాన్ని దొంగిలించావు. ఇప్పుడు అధికారంహస్తగతమైందని,

రాజమాతనై మేవాడ సర్వసంపదలు దోచుకోవాలని కోటబురుజులుపై కూర్చుని కులుకుతున్నావా! శిగ బట్టి క్రిందికి లాగుతాను జాగ్రత్త!

శీత : వనవీర్! ఆ ఖడ్గాన్నిలా అందించు ఈ ఘాతకిని తుదముట్టిస్తాను.

పన్నా: నీ ఖడ్గానికి కాలదోషం పట్టింది (కైజారుతీసి) ఈనిండు దర్బారులో నిన్ను చిత్రవధచేస్తాను. గుండెలమీద కుంపటి తొలగించి సుఖనిద్రపోదామనుకున్నావా! హంతకీ!

శీత : వనవీర్! ఎందుకైనామంచిది సైన్యాన్ని సిద్ధంచెయ్యి.

జయ : అహ్హా హ్హా హ్హా!!!!! సైన్యాన్ని... సిద్ధంచెయ్యండి... రసపుత్రసైన్యమంతా మానవహృదయం కలిగిన మేవాడ ప్రజానీకమనేమాట మరువవద్దు. సంగ్రామ సింహుని వంశనాశన మొనర్చిన హంతకుల శవదర్శనార్థమై చిత్తూరుకు ఉత్తరవైపున బారులుతీర్చి నిలబడ్డారు. సైన్యాన్ని సిద్ధంచెయ్యండి.

వన : సేనాపతిని పిలిపించి యీ ఉన్మాదిని బంధిస్తాను. (గంటకొట్టును)

(నేపథ్యంలో) ప్రభూ! రసపుత్ర సైనికులంతా రాజభవనాన్నే చుట్టుముట్టారు,

శీత : రాజభవనాన్నే చుట్టుముట్టారా?

నేపథ్యంలో) ఔను మహారాణీ! మారణాయుధాలన్నీ ఎనర క్తంత్రాగటానికే అత్రపడుతున్నవి. త్వరపడండి.

వన : నిజంగానా! సేనాపతి యెక్కడ? (త్వరగా వెళ్లబోవును)

పన్నా: (కత్తిదూసి) ఆగు మూర్ఖుడా !...
జయ : (కత్తిదూసి) అడుగు ముందుకు వేసావా జాగ్రత్త !
పన్నా: ప్రక్కలో బల్లెం పరలోకంలో వుందని తలంచావు కాబోలు, ఉదయసింగ్ !...ఉదయసింగ్ !...
శీత : (ఆశ్చర్యంగా) ఉదయసింగా !
వన : అంతా మోసం, కుట్ర.
ఉద : (కత్తిదూసి వేగంగా ప్రవేశించి) దాయమ్మా! ఈదు ర్మార్గుని నేనేవధిస్తాను. నా సోదరుడు చందన్‌కుమారుణ్ణి పొట్టబెట్టుకున్న కసాయిని నేనే హతమారుస్తాను.
పన్నా: శాంతించు ఉదయ్ !
జయ : వనవీర్ ! యింక గర్జించు చూస్తాను.
(నేపథ్యంలో) మహారాణా ఉదయసింగ్ ! జై హో!!! మహారాణా ఉదయసింగ్ జై హో !!! మహారాణా ఉదయసింగ్ జై హో !!!!!
శీత : (బయట జరుగుచున్న కోలాహలాన్ని చూచుటకు ద్వారం దగ్గరకు వెళ్లును)
[ముగ్గురి ఖడ్గములతో ముట్టడించ బడియున్న వనవీరుడు జయధ్వానములు వినినంతనే గత్యంతరములేక తనఖడ్గాన్ని క్రిందపడవైచి లొంగిపోవును]
జయ : అ హ్హా హ్హా హ్హా హ్హా !!! జ్యేష్ఠుడైన మహారాణా సంగ్రామసింహునికి చెందవలసిన రాజ్యాధికారాన్ని తాను అన్యాయంగా సంగ్రహించాలని, ఆనాడు పృధ్వీరాజు పిడికిట బిగించిన మారణాయుధం యీ

నాటికి పాపంపండి వనవీరుని హస్తంనుండి జారి క్రింద పడింది. అ హ్హా హ్హా హ్హా !!!!

శీత : (ప్రవేశించి క్రిందపడివున్న ఖడ్గాన్నిచూచి) వనవీర్ !

వన : అమ్మా !

శీత : ఖడ్గాన్ని క్రిందపడవైచావా ?

వన : ఔను తల్లీ !

శీత : నీ తండ్రి నీకుసమర్పించిన వీరఖడ్గాన్ని కళంకపరచి నీజయయాత్రను అసంపూర్తిగాముగించావానాయనా!

వన : నీ ప్రతిజ్ఞ నెరవేర్చనందుకు క్షమించాలి తల్లీ! నేను ధైర్యాన్ని కోల్పోయాను.

జయ : (హేళనగా) ఉత్తమరసపుత్ర వీరరక్తంతో తొణికిసలాడుతున్న క్షాత్రాణిగర్భమున ఉత్తరకుమారుడు జన్మించాడు.

పన్నా: తండ్రి వీరాధివీరుడైనా, తల్లి కళంకిని, కులట, ఆ కులటగర్భాన జన్మించిన వనవీరుడు, భీరుడుగాక, వీరుడెట్లగును. ( తన ఖడ్గాన్ని శీతల్ సేనికందిస్తూ ) యిదిగో! ఈ ఖడ్గంచేతబట్టి నీ ప్రతిజ్ఞ నీవే పూర్తిగావించు ... ఊం ...

శీత : (ఖడ్గాన్ని పట్టుకొనలేక చేతులు వణకిపోవును)

పన్నా: కుమారుని మారణశకటానికి సారధ్యంవహించిన నీవుకూడా ధైర్యాన్ని కోల్పోయావా పాపి !...

జయ : పాపాలు ప్రకోపించి వీరత్వం వణికిపోతుంది. బంధునాశనానికి ఒడిగట్టిన ఈ నరహంతకుల్ని ముక్కలముక్కలుగా నరికిపారవేస్తాను పన్నా !...

పన్నా: శాంతించు జయసింగ్! మేవాడపుణ్యభూమి, వీరులకు పుట్టినిల్లు, పాపపంకిలమైన ఈ పిరికిపందల రక్తాన్ని చిందించి, మన వీరభూమిని అపవిత్రంచేయవద్దు. మహారాణా ఉదయసింగు పరిపాలనలో మానవుడు మానవుని హత్యచేయటమనే అనాచారాలకు స్వస్తి చెప్పాలి. ఈ దుర్మార్గు లనుసరించిన విధానాన్ని మనమెందుకాచరించాలి! సంకెళ్ళుతగిలించి కారాగృహంలో బంధించండి. కోర్కెలనే రెక్కలు కట్టుకొని ఆకాశపథంలో విహరించాలని దీక్షబూనింది... పాపం.........సామ్రాజ్యతత్వాన్ని జీర్ణించుకోలేక రెక్కలు విరిగి నేలకూలింది. యెంతచెడ్డా కొంతకాలం మహారాణీ భోగాలనుభవించింది. సంకెళ్ళు తొలగించి కారాగృహంలో బంధించండి.

ఉద: (గంటకొట్టగా సిపాయివచ్చి వనవీరుని, శీతల్ సేనిని కారాగృహానికి గొంపోవును)

జయ: పన్నా! నీ సహనసద్భావాలతో పవిత్ర హిందూ ధర్మాన్ని నిరూపించావు. నీ త్యాగదీక్షతో భారత వీరచరిత్రకు ఉజ్వలభవితవ్యాన్ని చేకూర్చావు. పెనుతుపాను బీభత్సంలో నడిసముద్రాన దిక్కుతోచక అల్లాడిపోయే స్వాతంత్ర్యనౌకను మహానావికునివలె ఒడ్డుకు చేర్చావుతల్లీ! దుష్టనియంత శక్తులతో ఘనీభవించిన కారుమేఘాలను ఛేదించి మేవాడ ప్రజానీకానికి వెలుగు చేకూర్చావు. మేవాడరాజ్యలక్ష్మి నీలాంటి అమూల్యమైన వజ్రాన్ని ప్రసాదించి వనితా

లోకానికి వన్నె తెచ్చింది. భావిభారత వీర యువతీ యువకులు నీ కీర్తిగానంచేస్తూ స్వాతంత్ర్యశిఖరాల్ని అధిరోహించి విజయ పతాకాన్నెగురవేస్తారు. భారత మాత కంఠసీమ నలంకరించిన మణిహారంలో నాయక మణివై నీవు ఆచంద్రతారార్కం దేదీప్యమానంగా ప్రకాశిస్తావు తల్లీ!... ...(నేపథ్యంలో జయభేరి విను పించును) రసపుత్ర వీరయోధులంతా విజయోత్సా హంతో జయభేరి మ్రోగిస్తూ విశ్వాంతరాళమును ప్రతిధ్వనింప చేస్తున్నారు, రా తల్లీ!...

(అందరూ నిష్క్రమింతురు)

(నే పథ్యంలో బృందగానం)

జయ భారత నారీమణికీ ,
జయవీరాంచిత సద్గుణికీ
రాజపుత్ర లోకైక దీపికా
పూజనీయవై నావుగదా ॥జయ॥
దేశముకోసము త్యాగముచేసిన
భాసురశీలవు నీవెసదా
ఈ జగమందున సర్వమాన్యవై
ఏయుగములకూ నీవేధన్యవూ ॥జయ॥

తెర

సమాప్తం.

# తప్పొప్పుల పట్టిక.

| పేజీ | పంక్తి | తప్పులు | ఒప్పులు |
|---|---|---|---|
| 3 | 12 | నిర్జసమై | నిర్జీవమై |
| 4 | 12 | వెన్నెలలోని | మొసుప్పులలోని |
| 5 | 7 | బ్రద్ధలు | బ్రద్దలు |
| 5 | 8 | బ్రద్ధలైన | బ్రద్దలైన |
| 5 | 13 | క్షుద్భాధ | క్షుద్బాధ |
| 5 | 17 | మీకిచ్చుటకు | మీకిచ్చుట |
| 6 | 1 | పరుగుపడి | మరుగుపడి |
| 6 | 5 | తలకిందులు | తలక్రిందులు |
| 7 | 14 | అన్యాయం, | ఆ న్యాయం |
| | | అధర్మం | ఆ ధర్మం |
| 8 | 1 | నామననుస్సు | నామనస్సు |
| 8 | 3 | ఛండాలు | చండాలు |
| 8 | 13 | సిద్దంగా | సిద్ధంగా |
| 24 | 3 | ఛేధించు | ఛేదించు |
| 38 | 19 | పొంధండి | పొందండి |
| 40 | 15 | వంశంవృక్ష | వంశవృక్ష |
| 41 | 16 | బాపద | బాపదు |
| 67 | 8 | మారుయ్రోగు | మారుమ్రోగు |
| 71 | 2 | విరమ్ము | విరజిమ్ము |